**इने-गिने** - वि० వేళ్ళమీద లెక్కింపగలిగిన; కొద్దిమంది.

**इन्कलाब ; इन्किलाब** - पुं० విప్లవము.

**इन्किलाब जिंदाबाद** - पुं० విప్లవమువర్ధిల్లుగాక!

**इबादत** - स्त्री० పూజ; ఆరాధన.

**इब्तदा** - स्त्री० ప్రారంభము; జన్మ; ఆది.

**इमली** - स्त्री० చింతచెట్టు; చింతపండు; చింతకాయ.

**इमसाल**-अव्य० ఈ సంవత్సరము ; इस वर्ष.

**इमाम** - पुं० ముసల్మానుల పురోహితుడు; నాయకుడు; ముఖ్యుడు.

**इमामदस्ता** - पुं० खरल-बट्टी ; పొత్రము; రుబ్బురోలు; సన్నికల్లు రాయి.

**इमामबाडा**-पुं० ముసల్మానులగోరీల దొడ్డి.

**इमारत** - स्त्री० భవనము; భవంతి.

**इम्तहान** - पुं० పరీక్ష.

**इयत्ता** - स्त्री० హద్దు ; సీమ.

**इरादा** - पुं० సంకల్పము; నిశ్చయము.

**इर्दगिर्द** - क्रि०वि० సమీపమున ; ఇరుగు పొరుగున ; చుట్టు ప్రక్కల.

**इलजाम** - पुं० దోషారోపణ ; నేరము ; కళంకము.

**इलाका** - पुं० సంబంధము; ప్రాంతము; చిన్నరాజ్యము.

**इलाज** - पुं० చికిత్స; ఉపాయము; పరిష్కారము.

**इलायची** - स्त्री० ఏలక్కాయ.

**इलाही** - पुं० ఈశ్వరుడు.

**इल्जाम** - पुं० दे० इलजाम.

**इल्तिजा** - स्त्री० **इल्तिमास** - पुं० ప్రార్థన; వినయము; నివేదనము.

**इव** - अव्य० వలె.

**इशारा** - पुं० సంకేతము ; రహస్య ప్రేరణ.

**इश्क** - पुं० ప్రేమ; కోరిక ; అనురాగము.

**इश्कबाज** -वि० రసికుడు ; ప్రేమించువాడు.

**इश्तिहार** - पुं० विज्ञापन ; విజ్ఞాపనము.

**इस्म** - पुं० नाम పేరు.

**इस्तिरी** - स्त्री० ఇస్త్రీ; ఇస్త్రీ చేయు పెట్టె.

**इस्तेमाल**-पुं० ప్రయోగము; ఉపయోగము.

**इस्तेमाली**-वि० ప్రచలితమైన; ఉపయోగించబడిన.

**इस्मशरीफ** - पुं० శుభనామము; నామధేయము.

**इहसान** - पुं० दे० एहसान.

**इहलीला** - स्त्री० ఇహలోక జీవితము.

**इहाता** - पुं० दे० आहाता.

## ई

**ईंट** - स्त्री० **ईंटा** - पुं० ఇటుకరాయి.

**ईंधन** - पुं० వంట చెరకు; కట్టెలు.

**ईख** - पुं० చెఱుకు.

**ईजाद** -स्त्री० आविष्कार ; క్రొత్త విషయము కనిపెట్టుట లేక క్రొత్తజాడతెలిసికొనుట.

**ईति** - स्त्री० వ్యవసాయమునకు లేక పైరును నష్టపరుచు ఆరు రకముల అరిష్టములు - బాధలు.

**ईद** - स्त्री० మహమ్మదీయుల పండుగ मु० ईद का चाँद होना ; అరుదుగా కనిపించుట.

**ईदगाह** - स्त्री० ఈదు పండుగనాడు మహమ్మదీయులందరు చేరి నమాజు చేయు ప్రదేశము.

**ईमान** - पुं० విశ్వాసము; మత విశ్వాసము; నిజాయితీ.

**ईमानदार** - वि० నమ్మదగిన; నిజాయితిగల.

**ईमानदारी** - स्त्री० నిజాయితి; నమ్మకము.

**ईरान** - पुं० పర్షియాదేశము; పారసీ దేశము.

**ईषत** - वि० కొంచెము; కొద్ది.

**ईसवी** - वि० యేసుతో సంబంధించిన; सन; యేసు పుట్టుకతో ప్రారంభమగు శకము.

**ईसा ; ईसामसीह** - पुं० యేసుక్రీస్తు.

**ईसाई** - वि० క్రైస్తవ మతస్థుడు.

## उ

**उँगली** - स्त्री० వ్రేలు.

**उँघाई** - स्त्री० झपकी ; కునికిపాటు.

**उँडेलना** - स०क्रि० పారపోయుట; బోర్ల తిప్పుట.

**उऋण** - वि० ఋణ విముక్తుడైన.

**उकडूँ (बैठना)** - पुं० గొంతు కూర్చుండుట.

**उकलाना** - अ०कि० వమనము చేయుట; వాంతించుట.

**उकसाना** - स०क्रि० ఆవేశపరచుట; రెచ్చకొట్టుట.

**उकाब** - पुं० రాబందు.

**उक्त** - वि० చెప్పిన; చెప్పబడిన.

**उखाडना** -स०क्रि० పెకిలించుట; ధ్వంసము చేయుట.

**उगना** -अ०क्रि० మొలచుట; ఉదయించుట.

**उगलना** - स०क्रि० వెళ్ళగ్రక్కుట; డోకుట.

**उगाना** - स०क्रि० మొలపించుట.

**उगाहना** - स०क्रि० వసూలుచేయుట.

**उगाही**-स्त्री० వసులు; వసూలైన మొత్తము; భూమి పన్ను.

**उग्रता** - स्त्री० ఉగ్రత; దౌర్జన్యము.

**उघटना** - स०क्रि० దెప్పిపొడుచుట.

**उचकना** - अ०क्रि० మునివ్రేళ్ళమీద నిలబడుట.

**उचक्का**-पुं०దొంగ; దూర్తుడు स्त्री० **उचकी**.

**उचटना**-अ०क्रि०ऊबना-విసుగుచెందుట;

విరక్తుడగుట.

**चाट** - पुं० ऊब ; విరక్తి.

**च्छिष्ठ** - वि० ఎంగిలి पुं० जूठन ; ఎంగిలి వస్తువు ; తినగా మిగిలిన; తేనె.

**च्छृंखल**-पुं० అదుపులేని; నిరంకుశమైన.

**च्छेद** - पुं० విచ్ఛేదము ; నిర్మూలము.

**छल-कूद** - स्त्री० గంతులు - చిందులు; సంభ్రమము; సంతోషము.

**छलना** - अ०क्रि० గంతులు వేయుట; సంతోషముతో ఉప్పొంగిపోవుట.

**छाल** - स्त्री० కుప్పిగంతు; ఔన్నత్యము.

**छालना**-स०क्रि० పైకివిసరుట; ప్రకటించుట.

**छाह** - पुं० ఉత్సాహము.

**जडना** - स०क्रि० నిర్మూలించుట; నాశము చేయుట.

**जडा** - वि० పాడుపడిన; ధ్వంసావశేషము.

**जला** - वि० ఉజ్వలమైన; స్వచ్ఛమైన.

**जागर** - पुं० ప్రకాశము; కాంతి; ప్రసిద్ధి.

**जाड** - वि० పాడుపడిన ; ధ్వంసమైన ; पुं०ధ్వంసావశేషము; పాడుపడిన ప్రదేశము.

**जाडना** - स०क्रि० పాడుచేయుట; పాడు పెట్టుట; ధ్వంసముచేయుట.

**जाला** - पुं० వెలుతురు; కాంతి; వంశో ద్ధారకుడు वि. నిర్మలమైన.

**जेयार ; उजियारा** - पुं० दे० उजाला.

**उज्वल** - वि० ఉజ్వలమైన; ప్రకాశించుచున్న.

**उटकना** - स०क्रि० ఊహించుట; అంచనా వేయుట.

**उठना** - अ०क्रि० లేచుట; మొలకెత్తుట; మేల్కొనుట.

**उठान** - पुं० లేచుట; వెల్లువ.

**उठाना** - स०क्रि० ఎత్తుట; మోయుట; మేల్కొనుట.

**उडद** - पुं० మినుములు.

**उडनखटोला** - पुं० ఊయల; ఎగురునట్టి ఊయల; విమానము.

**उडना** - अ०क्रि० ఎగురుట; అదృశ్యమగుట.

**उडाऊ ; उडाकू** -वि० దుబారా ఖర్చు చేయు; మిడిసిపడు; ఎగురునట్టి.

**उडाना** - स०क्रि० ఎగిరించుట; ఎగుర వేయుట; మాయము చేయుట; పార దోలుట; మోసము చేయుట; దొంగి లించుట; ఖర్చుచేయుట.

**उढाना** - स०क्रि० दे० ओढाना.

**उतना** - वि० అంత.

**उतपात** - पुं० दे० उत्पात.

**उतरन** - पुं० విడిచిన దుస్తు లేక వస్త్రము.

**उतरना** - अ०क्रि० క్రిందకు దిగుట; దిగుట; తగ్గుట; బసచేయుట; రంగుపోవుట.

**उतराई** - स्त्री० దిగుట; రేవు (పడవ) కూలి;

ఏటవాలు భూమి.

**उतराना** - अ०क्रि०తేలుట; నీటిపై తేలుట.

**उतार** - पुं० ఏటవాలు భూమి; తగ్గుదల; దిగెడు చోటు; సముద్రపు పోటు.

**उतारना** - स०क्रि० దింపుట; దిష్టితీయుట.

**उतावला**-वि० जल्दबाज; తొందరపాటు గల; తొందరపెట్టు; హడావిడిచేయు.

**उतावलापन** - पुं० ఆతురత; ఓర్పులేమి; తొందరపాటు.

**उतावली** - स्त्री० తొందరపాటు; హడావిడి वि० హడావిడి చేయునట్టి (स्त्री).

**उत्कंठा** - स्त्री० కుతూహలము; తహతహ.

**उत्कर्ष** - पुं० ఔన్నత్యము; సంపన్నత; ఎదుగు.

**उत्कीर्ण** - वि० చెక్కిన; వ్రాసిన.

**उत्तर** - पुं० ఉత్తరపు దిశ; జవాబు.

**उत्तराधिकारी** - पुं० వారసుడు.

**उत्तरोत्तर** - वि० క్రమానుసారముగా; మీదు మిక్కిలి.

**उत्तीर्ण** - पुं० కృతార్థుడైన (పరీక్షలో) ఉద్ధరింపబడిన; దరిజేరిన.

**उत्तुंग** - वि० उत्तंग; మిక్కిలి ఎత్తయిన.

**उत्तेजक** - वि० ప్రేరేపించునట్టి.

**उत्तेजना** - स्त्री० ప్రేరేపణ; ఉద్రేకము; క్రోధము.

**उत्तेजित** - पुं० పదును పెట్టబడిన; ప్రేరింపబడిన.

**उत्सुक** - वि० ఉత్సుకతగల; తహతహలాడు.

**उथल-पुथल** - पुं० తారుమారు; క్రమ భంగము; అశాంతి.

**उथला** - वि० छिछला ఎక్కువలోతులేని.

**उदंत** - पुं० వృత్తాంతము; వార్త; దంతములు అనగా పల్లులేనివాడు.

**उदधि** - पुं० जलनिधि సముద్రము; మేఘము; నీటికుండ.

**उदात्त** - वि० ఉదాత్తమైన; శ్రేష్ఠమైన; దయ గల; దాత.

**उदारचेता** - वि० ఔదార్యముగల; దయగల.

**उदास** - वि० దుఃఖమునొందిన; ఆసక్తి హీనుడు.

**उदासी** - स्त्री० ఔదాసీన్యము; విరాగము.

**उदासीन** - पुं० విరాగి; తటస్థమున.

**उदित** - पुं० ఉదయించిన; చెప్పబడిన; పుట్టిన.

**उद्घाटन** - पुं० ప్రారంభోత్సవము; గుట్టును రట్టుచేయుట; తెరచుట; ప్రకటన చేయుట.

**उद्दंड** - वि० ప్రచండమైన; భీతిలేని; పొగరు బోతు.

**उद्धरण** - पुं० ఉటంకించబడినది; ఉద్ధరణ; ఉద్ధరింపు.

**उध्दार** - पुं० విముక్తి, వడ్డీలేని అప్పు, అభ్యు

దయము.

**उद्यम** - पुं० యత్నము, పరిశ్రమ.

**उद्यमी** - वि० శ్రమించునట్టి, పాటుపడునట్టి

**उद्योग** - पुं० ప్రయత్నము, ప్రయాస, ఉద్యమము, ఉద్యోగము, వృత్తి.

**उद्वेग** - पुं० ఆవేశము, విజృంభణ.

**उद्वासन** - पुं० వెడలుగొట్టుట, ధ్వంసము చేయుట, వధించుట.

**उधर** - अव्य० అటు, ఆవైపు.

**उधार** - पुं० ఋణము.

**उधारना** - स०क्रि० ఉద్ధరించుట.

**उधेडबुन** - स्त्री० చింత; కలవరము.

**उनचास** - वि० నలభైతొమ్మిది; 49.

**उनतीस** - वि० ఇరవైతొమ్మిది; 29.

**उन्मत्त** - वि० मतवाला ; మత్తెక్కిన; మదించిన

**उन्माद** - पुं० ఉన్మాదము ; పిచ్చి ; వెఱ్ఱి ; पागनपन.

**उन्भेष** - पुं० వికాసము.

**उपकृत** - वि० आभारी ; కృతజ్ఞుడు.

**उपक्रमणिका** - पुं० విషయసూచి.

**उपक्रांत**- पुं० ప్రారంభింపబడిన.

**उपचार** - पुं० సేవ; చికిత్స

**उपज** - स्त्री० ఉత్పత్తి; కల్పన.

**उपजना** - अ०क्रि० మొలచుట; పుట్టుట.

**उपजाऊ** - वि० ఉర్వరమైన; సారవంతమైన.

**उपजीविका** - स्त्री० జీవనోపాధి.

**उपधा** - स्त्री० కపటము; మోసము.

**उपनाम** - पुं० ఉపనామము.

**उपनिवेश** - पुं० వలస.

**उपन्यास** - पुं० నవల.

**उपपति** - पुं० ప్రియుడు; రంకుమగడు.

**उपभोग** - पुं० భోగము; ఆస్వాదనము; సంభోగము.

**उपरना** - पुं० चादर ; దుప్పటి.

**उपमा** -स्त्री० **उपमान** - पुं० ఉపమానము.

**उपयुक्त** - वि० తగిన; అర్హమైన.

**उपरांत** - क्रि०वि० పిమ్మట; పిదప; అనంతరము.

**उपरी** - स्त्री० उपली ; చిన్న పిడక.

**उपला** - पुं० कडा పిడక.

**उपलब्धि** - स्त्री० ప్రాప్తి ; లబ్ధి.

**उपवास** - पुं० ఉపవాసము ; फाका.

**उपस्थित** - वि० హాజరైన.

**उपहास**-पुं० दिल्लगी; ఎగతాళి; పరిహాసము.

**उपाधि** - स्त्री० బిరుదు; ధర్మచింత; ఉపద్రవము; కపటము.

**उपासक** - वि० ఆరాధకుడు; పూజించువాడు; భక్తుడు.

**उपासना** - स्त्री० आराधना ; పూజ;

ఆరాధన; పరిచర్య.
**उपास्य** - वि० ఉపాస్యుడు; సేవ్యుడు.
**उपेक्षा** - वि० నిర్లక్ష్యము; తిరస్కారము..
**उपेक्षित** - वि० నిర్లక్ష్యముచేయబడిన; తిరస్కరింపబడిన.
**उफ** - अव्य० అయ్యో! అబ్బా स्त्री० आह; నిట్టూర్పు.
**उफनना** - अ०क्रि० పొంగుట; (పాలు మొ॥)
**उफान** - पुं० उबाल; పొంగు.
**उबकाई** - स्त्री० వాంతి.
**उबटन** - पुं० నలుగుపిండి; అభ్యంగనము.
**उबरा** - वि० ఉద్ధరింపబడిన; రక్షింపబడిన.
**उबलना** - अ०क्रि० उफनना ; పొంగుట.
**उबारना** - स०क्रि० రక్షించుట; కాపాడుట.
**उबाल** - पुं० उफान- పొంగు (పాలు మొ॥)
**उबालना** - स०क्रि० పొంగించుట; పొంగు వచ్చువరకు కాచుట.
**उबेना** - वि० పాదరక్షలు లేని (పాదములు)
**उभरना** - अ०क्रि० दे० उभडना.
**उभाडना** - स०क्रि० ప్రేరేపించుట; రెచ్చగొట్టుట.
**उभारना** - स०क्रि० दे० उभाडना.
**उमंग** - स्त्री० ఉత్సాహము; ఉల్లాసము; పొంగు.
**उमदा** - वि० बढिया ; శ్రేష్ఠమైన; ఇంపైన.
**उमर ; उम्र** - स्त्री० వయస్సు.
**उमरा ; अमराव** - पुं० अमीर का बहु० ప్రతిష్ఠగలవాడు; రాజసభయందలి సభాసదులు; ధనవంతులు.
**उमस** - स्त्री० ఉక్క.
**उमेठना** - स०क्रि० మెలిబెట్టుట.
**उमेडना** - स०क्रि० दे० उमेठना.
**उम्दा** - वि० दे० उमदा.
**उम्मीद ; उम्मेद** - स्त्री० ఆశ; కోరిక; నమ్మకము.
**उम्मीदवार ; उम्मेदवार** - पुं० అభ్యర్థి; దరఖాస్తుదారు.
**उम्र** - स्त्री० दे० उमर.
**उर** - पुं० హృదయము; మనస్సు; వక్షస్థలము.
**उरेहना** - पुं० చిత్రించుట; వ్రాయుట.
**उरोज** - पुं० కుచము; చన్ను.
**उर्फ** - पुं० ఉపనామము; మరియొక పేరు.
**उर्वी** - स्त्री० భూమి.
**उलझन** - स्त्री० చిక్కు; చింత; ఇబ్బంది.
**उलझना** - अ०क्रि० చిక్కుపడుట; చిక్కుకొనుట; ఘర్షణ పడుట.
**उलझाना** - स०क्रि० చిక్కించుట; ఇబ్బంది పెట్టుట.
**उलझाव** - पुं० दे० उलझन.
**उलटना** - अ०क्रि० తారుమారు అగుట;

తలక్రిందులగుట. स०क्रि० బోర్లించుట.

**उलटा** - वि० తలక్రిందైన; తారుమారైన.

**उलटी** - स्त्री० వాంతి.

**उलाहना** - पुं० నింద; ఒకని దోషము మరియొకనితో చెప్పుట; నిందించుట.

**उलूक** - पुं० उल्लू ; గుడ్లగూబ.

**उलूखल** - पुं० ओखली ; రోలు.

**उल्का** - स्त्री० తోకచుక్క; కాగడా.

**उल्कापात** - पुं० ఉల్కాపాతము; తోకచుక్క పడుట.

**उल्फत** - स्त्री० दे० उलफत.

**उल्लंघन** - पुं० దాటుట; మీరుట.

**उल्लसित** - वि० సంతసించిన.

**उल्लिखित** - वि० చెప్పబడిన; చెక్కిన.

**उल्लू** - पुं० గుడ్లగూబ.

**उल्लेख** - पुं० చర్చ; వ్రాయుట.

**उल्लेखनीय** - वि० చెప్పదగిన; వ్రాయదగిన.

**उशीर** - पुं० వట్టివేరు.

**उष्म** - पुं० వేడిమి; ఎండ; వేసవి.

**उसकाना** - स०क्रि० भडकाना; రెచ్చగొట్టుట; ప్రేరేపించుట.

**उसाँस** - स्त्री० आह ; నిట్టూర్పు.

**उसारा** ; पुं० बरामदा ; వసారా; వరండా.

**उसीर** - पुं० दे० उशीर.

**उसूल** - पुं० సిద్ధాంతము.

**उस्तरा** - पुं० మంగలికత్తి.

**उस्ताद** - पुं० గురువు; ఉపాధ్యాయుడు; చతురుడు.

## ऊ

**ऊँघ** - स्त्री० కునికిపాటు; కునుకు.

**ऊँघना** - अ०क्रि० కునికిపాటు పడుట.

**ऊँचा** - वि० ఎత్తయిన; బిగ్గరయగు.

**ऊँचाई** - स्त्री० ఎత్తు; గొప్పదనము.

**ऊँचे** - क्रि०वि० పైపైపు; మీద.

**ऊँट** - पुं० ఒంటె.

**ऊख** - पुं० ईख ; చెఱుకు.

**ऊखल** - पुं० ओखली; రోలు.

**ऊजड** - वि० उजाड; పాడుపడిన.

**ऊटपटाँग** - वि० వ్యర్థమైన; అసంబద్ధమైన.

**ऊद** - पुं० అగరు.

**ऊदबत्ती** - स्त्री० अगरबत्ती; అగరు వత్తి.

**ऊदा** - वि० ఊదారంగు గల.

**ऊधम** - पुं० గందరగోళము; కోలాహలము; అల్లరి; కొట్లాట.

**ऊधमी** - वि० అల్లరిచేయు; ఉపద్రవము చేయునట్టి.

**ऊन** - पुं० ఉన్ని; वि० తక్కువ; తుచ్ఛమైన.

**ऊनी** - वि० ఉన్నితో తయారైన; తక్కువైన.

**ऊपर** - अव्य० మీద; అదనముగా; పైభాగమున.

**ऊपरी** - वि॰ పైకి సంబంధించిన ; ఆడంబరము గల.

**ऊबड-खाबड** - वि॰ మెరక పల్లములు గల; సమతలము గాని.

**ऊबना** - अ॰क्रि॰ విసుగుట; కలతజెందుట.

**ऊरु ; ऊरू** - पुं॰ जाँघ ; తొడ.

**ऊर्ज** - वि॰ శక్తివంతమైన; బలమైన.

**ऊर्जस्वी** - वि॰ ప్రతాపము గల; శక్తిగల.

**ऊर्ध्व**-क्रि॰वि॰ ऊपर ; పైన; वि॰ పైనుండు.

**ऊर्मि ; ऊर्मी** - स्त्री॰ అల; తరంగము.

**ऊर्मिमाली** - पुं॰ సముద్రము.

**ऊलजलूल** -वि॰ అసంబద్ధమైన; తల తోకలేని.

**ऊसर** - पुं॰ చవటి నేల; ఊసర క్షేత్రము; సారములేని భూమి.

**ऊहापोह** - पुं॰ ఆలోచన; తర్క-వితర్కము.

## ऋ

**ऋचा** - स्त्री॰ ఛందోబద్ధమైన వేద మంత్రము.

**ऋजु** - वि॰ తిన్నని; సరళమగు; సులభమైన; కపటములేని.

**ऋण** - पुं॰ అప్పు; ఋణము.

**ऋणी ; ऋणिया** - पुं॰ అప్పుతీసుకున్న వాడు.

**ऋतु** - पुं॰ ఋతువు.

**ऋतुराज** - पुं॰ వసంతఋతువు; వసంతుడు.

**ऋषि** - पुं॰ ఋషి.

## ए

**एँडा** - स्त्री॰ दे॰ एडी.

**एक** - वि॰ ఒకటి; ఒంటరి; సాటిలేని.

**एकक** - वि॰ ఒకే ఒక; वि॰ ఒంటరి.

**एकटक** - अव्य॰ రెప్పవాల్చక; రెప్పవాల్చకుండా.

**एकता** - स्त्री॰ ఐకమత్యము.

**एकतारा** - पुं॰ ఏకానాదనము; ఒక తీగగల వాద్యము.

**एकत्र** - अव्य॰ ఒకచోట.

**एकत्रित** - वि॰ ఒకచోట చేరిన; సమకూర్చబడిన.

**एकदम** - पुं॰ ఒకేసారిగా; నిరంతరము.

**एकफसला** - वि॰ ఒక పంట మాత్రము పండు.

**एक बारगी** - पुं॰ ఒకేసారి; తటాలున.

**एकबाल** - पुं॰दे॰ इकबाल.

**एकमत** - वि॰ ఒకే అభిప్రాయము కలిగిన; సర్వసమ్మతి గల.

**एकरंग** - वि॰ ఒకేరంగుగల; కపటములేని నిర్మలమైన హృదయము గల.

**एकरस** - पुं॰ ఒకే విధమగు; మార్పులేని.

**एकलौता** - पुं॰ ఏకైక పుత్రుడు.

**एकसा** - वि॰ ఒకే మాదిరిగా; సమానముగా.

**एकहत्था** - पुं॰ ఏకాధిపత్యము; वि॰ ఒకే

వ్యక్తిచేతిమీదుగా జరుగునట్టి.

**एकहरा** - वि० इकहरा ; ఒకే పేటగల.

**एकांकी** - पुं० ఏకాంకి (నాటకము)

**एकांगी** - वि० ఒకే అంగము గల; ఒక పక్షము నకు చెందిన.

**एकांत** - वि० వేరుగానున్న; ఒంటరి; पुं० ఏకాంతము; ఒంటరితనము.

**एकाई**-स्त्री० ఒకట్ల స్థానము; ఒకటి; इकाई.

**एकायक** - अव्य० अकस्मात; తటాలున; అకస్మాత్తుగా.

**एकाकी**-वि०अकेला; ఒంటరి; తోడులేని.

**एकाग्र** - वि० అచంచలమైన; ఏకాగ్రముగా.

**एकाग्रता** -पुं० ఏకాగ్రత; స్థిరత; అచంచలత.

**एकाधिकार** - पुं० ఏకాధిపత్యము.

**एक्का** - वि० ఒంటరి पुं० ఆసు; ఒక విధమగు గుఱ్ఱపు బండి; इक्का.

**एक्का - दुक्का** - वि० अकेला - दुकेला ; ఒకరిద్దరు.

**एक्की** - स्त्री० ఒంటెద్దు బండి.

**एडी** - स्त्री० మడమ.

**एरंड ; रेंड** - पुं० ఆముదపు చెట్టు.

**एलची** - पुं० దూత; రాజదూత.

**एवं** - अव्य० और ;మరియు ऐसा ही ; ఇట్లే

**एव** - अव्य० ही; भी; మాత్రమే; కూడ.

**एहसास** - पुं० చేతితో ముట్టుట; తెలిసి కొనుట; అనుభూతి పొందుట.

# ऐ

**ऐंचना** - स०क्रि० खींचना ; లాగుట.

**ऐंचाताना** - वि० भेंगा ; మెల్లకన్నుగల.

**ऐंचातानी** - स्त्री० खींचातानी; తమ తమ వైపునకు లాగుకొనుట.

**ऐंठ** - स्त्री० अकड; నిక్కు; గర్వము; మెలి; పొగరు.

**ऐंठन** - स्त्री० मरोड ; పురి; మెలి.

**ऐंठना** - स०क्रि० పేనుట; పురిపెట్టుట; గుంజుట; బలవంత పెట్టి వసూలు చేయుట; अ०क्रि० మెలిపడుట; మిడిసి పడుట.

**ऐच्छिक** -वि० ఇష్టము వచ్చినది; వైకల్పికము.

**ऐतिहासिक** - वि० చారిత్రకము; చరిత్రాత్మకమైన చరిత్ర తెలిసినవాడు.

**ऐन** - वि० ठीक ; సరియగు; తగిన स्त्री० आँख ; కన్ను.

**ऐनक** - स्त्री० కళ్ళజోడు.

**ऐब** - पुं० దోషము; కళంకము; అవగుణము.

**ऐबगोई** - स्त्री० పరనింద.

**ऐबी** - वि० అవగుణములు గల.

**ऐयारी** - स्त्री० మోసము; ధూర్తత్వము; కపటము.

**ऐयाशी** - स्त्री० విషయాసక్తి; వ్యభిచారము.

**ऐरा गैरा** - स्त्री० పరాయివాడు; తెలియని వాడు; తుచ్ఛుడు.

**ऐलान** - पुं० ప్రకటన; దండోరా.

**ऐसा** - वि० ఇటువంటి; ఇట్లు.

**ऐसे** -अव्य० ఈ విధముగా; ఈ ప్రకారముగా.

**ऐहिक** - वि० ఇహలోక సంబంధమైన.

# ओ

**ओंठ** - पुं० పెదవి.

**ओक** - पुं० ఇల్లు.

**ओकना** - अ०क्रि० వమనము చేయుట; వాంతి అగుట; గేదెవలె అరచుట.

**ओकाई** - स्त्री० వాంతి; కక్కు.

**ओछा** - वि० నీచమైన; లోతులేని; గంభీరముకాని.

**ओछापन** - पुं० నీచత్వము; తుచ్ఛత.

**ओज** - पुं० తేజస్సు; ప్రతాపము; ప్రకాశము.

**ओजस्विता** - स्त्री० తేజము; ప్రతాపము; కాంతి.

**ओझल** - पुं० చాటు; అదృశ్యము.

**ओझल होना** - अ०क्रि० అదృశ్యమగుట.

**ओझा** - पुं० బ్రాహ్మణులలో ఒక శాఖ; భూతవైద్యుడు.

**ओट** - स्त्री० చాటు; మరుగు.

**ओढना** - स०क्रि० వస్త్రముతో శరీరమును కప్పుకొనుట; దుప్పటి.

**ओढनी** - स्त्री० ఓణీ.

**ओढाना** - स०क्रि० उढाना ; కప్పుట (వస్త్రముతో).

**ओतप्रोत** - पुं० పడుగుపేక; वि० పడుగు పేకల వలె కలసి ఉన్న.

**ओनामासी**-स्त्री०అక్షరాభ్యాస ప్రారంభము.

**ओपी** - वि० चमकीला ; మెరయుచున్న; కాంతివంతమైన.

**ओफ** - अव्य० उफ ; అయ్యో బాధతో కూడిన మూలుగు; అరుపు.

**ओर** - स्त्री० వైపు; దిక్కు.

**ओर - छोर** - पुं० మొదలు; తుది; అంచు.

**ओला** - पुं० వడగల్లు; తెరచాటు రహస్యము; वि० వడగల్లువలె చల్లని.

**ओष्ठ** - पुं० होंठ పెదవి.

**ओस** - स्त्री० మంచు.

**ओसाई** - स्त्री० తూర్పార; తూరుపాఅ.

**ओसाना** - स०क्रि० తూర్పార పట్టుట; తూరుపాఅ బట్టుట.

**ओसार** - पुं० फैलाव; వ్యాప్తి; వెడల్పు; वि०వెడల్పయిన.

**ओसारा** - पुं० बरामदा ; వసారా.

**ओह** - अव्य० ఆహా; అయ్యో.

**ओहदा** - पुं० హోదా; పదవి.

**कंबल** - पुं० కంబళి.
**कंबु** - पुं० శంఖము; ఏనుగు; కంఠము.
**कई** - वि० పెక్కు; ఎన్నో; అనేకమగు.
**ककडी** - स्त्री० దోసకాయ.
**ककहरा** - पुं० 'క' కారమునుండి 'హ' కారము వరకు గల అక్షరములు.
**कक्ष** - पुं० చంక; గడప; గది.
**कक्षा** - स्त्री० తరగతి; వర్గము.
**कगर ; कगार** - पुं० ఎత్తయిన ఒడ్డు; ఎత్తయిన దరి.
**कच** - पुं० కేశ సమూహము.
**कचरा** - पुं० పచ్చిపుచ్చకాయ; దోసకాయ; చెత్త - చెదారము.
**कचहरी** - स्त्री० కచ్చేరి; కార్యాలయము; న్యాయస్థానము.
**कचूर** - पुं० కచ్ఛూరము; కర్పూరము.
**कचौडी** - स्त्री० ఒక రకమైన పూరి; మినుప; పెసర మొ. రుబ్బి పిండితో తయారైన తిను పదార్థము.
**कच्चा** - वि० పండని; పక్వమునకు రాని; పచ్చి అనుభము లేని.
**कच्चा चिट्ठा**-पुं० అసలు సంగతులు; రహస్య ములు; సిసలు చేయబడని లెక్కలు.
**कच्चा माल** - पुं० ముడిసరుకు.
**कच्ची रसोई** - स्त्री० సాధారణమైన వంట పదార్థములు; అన్నము ; కూరలు మొ॥
**कच्ची सडक** - स्त्री० మట్టిరోడ్డు.
**कच्ची बही** - स्त्री० రోజువారి ఛిఠా పుస్తకము.
**कच्चे बच्चे** - पुं० చాల చిన్న పిల్లలు; పిల్లాజెల్ల.
**कछार** - पुं० సముద్రము లేక నదియొడ్డున నుండు నెమ్ముగల పల్లపు ప్రదేశము.
**कछारना** - स०क्रि० శుభ్రపరచుట.
**कछु** - वि० कुछ ; కొద్ది ; కొంత ; కొన్ని.
**कछुआ** - पुं० తాబేలు.
**कजरी ; कजली** - स्त्री० కాటుక; కాటుక కళ్ళు గల ఆవు; శ్రావణమాసములో వచ్చు ఒకపండుగ.
**कजाक** - पुं० लुटेरा ; దోపిడిదారుడు; బందిపోటు దొంగ.
**कजाकी**-स्त्री० लूट ; దోపిడి; బందిపోటు దొంగతనము.
**कटक** - पुं० సైన్యము; కంకణము.
**कटकटाना** - अ०क्रि० పళ్ళు పట పట కొరుకుట.
**कटघरा** - पुं० బోను; పెద్ద బోను.
**कटना** - अ०कि० తెగుట; గడచుట; క్షీణించుట; ముగించుట.
**कटनी** - स्त्री० కోయు పనిముట్టు ; పంట కోత; పంట (పైరు) కోతకాలము.

**कटहल** - पुं० పనస చెట్టు లేక కాయ.

**कटहा** - वि० కోయువాడు; ప్రేతకర్మములు చేయించువాడు; కొరికి తినువాడు.

**कटाई** - स्त्री० కత్తిరింపు; కోత; కోతకూలి.

**कटाकटी** - स्त्री० मारकाट ; దెబ్బలాట.

**कटाक्ष** - पुं० క్రీగంటి చూపు; దెప్పిపొడుపు.

**कटाना** - स०क्रि० కోయించుట.

**कटाव** - पुं० కోత; కత్తిరింపు.

**कटि** - स्त्री० कमर ; నడుము.

**कटि-बंद** - पुं० వడ్డాణము; బెల్టు; మొలత్రాడు.

**कटु** - वि० కటువైన; ఇంపుకాని.

**कटुता** - स्त्री० పరుషత్వము; ఇంపుకాని తనము; కటుత.

**कटूक्ति** - स्त्री० అప్రియమైన మాట; కటూక్తి

**कटोरा** - पुं० ; **कटोरी** - स्त्री० చిన్న గిన్నె; కప్పు.

**कटौती** - स्त्री० కోత; తగ్గింపు.

**कट्टर** - वि० అంధ విశ్వాసముగల; మూర్ఖుడైన; మొండి పట్టుదల గల.

**कठ** - पुं०दे० काठ.

**कठघरा** - पुं० కొయ్యబోను.

**कठपुतली** - स्त्री० కొయ్యబొమ్మ; స్వబుద్ధి లేక ఇతరులు చెప్పినట్లు నడుచువాడు.

**कठबाप** - पुं० సవతి తండ్రి.

**कठमरत** - वि० చీకుచింత లేని; వ్యభిచారి.

**कठिन** - वि० కఠినమైన.

**कठिनाई** - स्त्री० కాఠిన్యము; కఠోరత.

**कठुला** - पुं० కంఠహారము.

**कठौता**-पुं० **कठौती**-स्त्री० కొయ్యపాత్ర.

**कडक** - अ०क्रि० కఠోరమైన ధ్వని; ఉరుము.

**कडकना** - अ०क्रि० గర్జించుట.

**कडकडाहट** - स्त्री० గర్జన; గద్దింపు; కడకడా మను భీకరధ్వని.

**कडाई** - स्त्री० గట్టిదనము; కాఠిన్యము; బిగువు.

**कडाही** - स्त्री० చిన్న బాణలి.

**कडी** - स्त्री० గొళ్ళెము; కొక్కెము; గొలుసు నందలి ఒక ఉంగరము ; वि० కఠోరమైన.

**कडुआ** - वि० చేదైన; కోపిష్టి; ఘాటైన.

**कडुआ तेल** - पुं० ఆవనూనె.

**कडुआना** - अ०क्रि० చేదగుట; చిలుము పట్టుట; కోపపడుట.

**कढना** - अ०क्रि० निकलना; బయలు దేరుట; ఉదయించుట.

**कढाव** - पुं० అల్లిక; అద్దకపు పని.

**कढी** - स्त्री० ఒక విధమగు మజ్జిగ పులుసు.

**कण** - पुं० కణము; రవ.

**कत** - पुं० కలము; పాళి.

**कतई** - अव्य॰ बिलकुल ; బొత్తిగా; పూర్తిగా; ఏ మాత్రము.

**कतनी** - स्त्री॰ రాట్నపు కదురు.

**कतरना** - स॰क्रि॰ కత్తిరించుట; पुं॰ పెద్ద కత్తెర.

**कतरनी** - स्त्री॰ కత్తెర.

**कतर-ब्योंत**-स्त्री॰ काट - छाँट కత్తిరింపు; తారుమారు; యుక్తి; ఆలోచన.

**कताई** - स्त्री॰ వడకుట (నూలు); వడుకు కూలి.

**कतार** - स्त्री॰ పంక్తి; శ్రేణి; వరుస.

**कतिपय** - वि॰ కొంతమంది; కొన్ని; ఎన్నో కొన్ని.

**कतारा** - वि॰ లావుపాటి ఎఱ్ఱని చెఱుకు.

**कत्ती** - स्त्री॰ బాకు; చిన్న కత్తి లేక బాకు.

**कत्था** - पुं॰ కాచు.

**कत्ल** - पुं॰ హత్య.

**कत्ले - आम** - पुं॰ బాహాటమైన హత్యా కాండ.

**कथन** - पुं॰ కథనము; చెప్పుమాట.

**कथनी** - स्त्री॰ మాట; కథనము; వాగుడు.

**कथनीय** - वि॰ చెప్పదగిన.

**कथित** - वि॰ చెప్పబడిన.

**कथोपकथन** - पुं॰ వార్తాలాపము.

**कदंब** - पुं॰ కదంబ వృక్షము; కడిమిచెట్టు; సమూహము; గుంపు.

**कद** - पुं॰ ऊँचाई ; ఎత్తు.

**कदम** - पुं॰ కాలు; అడుగు; అంగ; గుఱ్ఱపు నడక.

**कदराई** - स्त्री॰ कायरता ; పిరికితనము.

**कदराना** - अ॰क्रि॰ భీతినొందుట; భయపడుట.

**कदर्थ** - वि॰ పనికిరాని; నికృష్టమైన.

**कदर्थ** - वि॰ कंजूस ; లోభి; పిసినగొట్టు.

**कदली** - स्त्री॰ केला ; అరటి.

**कदा** - अव्य॰ कभी ; ఎప్పుడైనా.

**कदाचित** - अव्य॰ शायद ; బహుశా; ఒకవేళ; ఎప్పుడైనా.

**कदापि**-अव्य॰ कभी; ఎంతమాత్రమును; ఎప్పుడూ కూడ.

**कद्दावर** - वि॰ దీర్ఘకాయుడగు; ఆజాను బాహువు.

**कन** - पुं॰ दे॰ कण.

**कनक** - पुं॰ బంగారము; ఉమ్మెత్త.

**कनकटा** - वि॰ చెవులు తెగినవాడు.

**कनकौआ** - पुं॰ గాలిపటము.

**कनखजूरा** - पुं॰ కాళ్ళ జెర్రి.

**कनखी** - स्त्री॰ క్రీగన్ను; క్రీగంట చూపు.

**कनछेदन** - पुं॰ చెవులు కుట్టుట.

**कनपटी** - स्त्री॰ కణత.

**कनसार** - पुं० ठठेरा ; కంచరి.
**कनसुई** - स्त्री० ఆచూకి; ధ్వని.
**कनस्तर** - पुं० డబ్బా.
**कनात** - स्त्री० ముతక పరదా.
**कनियाना** - अ०क्रि० కంటబడకుండ తప్పించుకు తిరుగుట.
**कनी** - स्त्री० నీటిబిందువు; చిన్న ముక్క; వజ్రపు రవ.
**कनेर** - पुं० గన్నేరు.
**कनोई** - स्त्री० खूँट - గుబిలి (చెవి) कान की मैल.
**कन्ना** - पुं० బియ్యపు నూక; తవుడు; గాలి పటపు మధ్యనున్న దారము.
**कन्नासी** - स्त्री० ఆకురాయి.
**कन्नी** - स्त्री० గాలిపటపు అంచులు; అంచు; తాపీ.
**कन्हाई ; कन्हैया** - पुं० కృష్ణుడు.
**कपट** - पुं० కపటము.
**कपडा** - पुं० బట్ట; వస్త్రము.
**कपार ; कपाल** - पुं० తలపుర్రె; భిక్షాపాత్ర.
**कपाली** - पुं० శివుడు.
**कपास** - पुं० పత్తి లేక పత్తి చెట్టు.
**कपि** - पुं० మర్కటము; సూర్యుడు.
**कपित्थ** - पुं० వెలగచెట్టు లేక వెలగపండు - కాయ.
**कपिल** - वि० బూడిదరంగు గల; पुं० కుక్క; ఒక ఋషి.
**कपूत** - पुं० కుపుత్రుడు; చెడుపుత్రుడు.
**कपूर** - पुं० కర్పూరము.
**कपोत** - पुं० పావురము; గువ్వ.
**कपोतव्रत**-पुं० నోరు మెదుపకుండా మౌనము వహించి అత్యాచారము సహించుట.
**कपोल** - पुं० गाल ; కపోలము; చెక్కిలి.
**कफ** - पुं० కఫము; చొక్కా ముంజేయి కఫము.
**कफन** - पुं० శవముపై కప్పు వస్త్రము.
**कफन-खसोट** - पुं० कंजूस ; లోభి, పిసిని గొట్టు.
**कफस** - पुं० पिंजडा పంజరము ; కారాగారము; శరీరము.
**कबंध** - पुं० తలలేని మొండెము; మేఘము; నీరు.
**कब** - क्रि०वि० ఎప్పుడు.
**कबड्डी** - स्त्री० చెడుగుడు ఆట.
**कबरी** - स्त्री० స్త్రీల కొప్పు; కేశపాశము.
**कबाड** - पुं० చెత్తాచెదారము; పనికిమాలిన వస్తువులు.
**कबाडिया ; कबाडी** - पुं० పాతవస్తువులు; పనిమాలిన వస్తువులు అమ్మువాడు ; కలహ ప్రియుడు.
**कबाब** - पुं० ఒక విధమగు మాంసపు

ఆహారము.

**कबार** - पुं॰ रोजगार ; వృత్తి.

**कबारना**-स॰क्रि॰उखाडना; పెల్లగించుట.

**कबीर** - वि॰ శ్రేష్ఠమైన; पुं॰ కబీరుదాసు.

**कबीरा** - पुं॰ మహాపాపము.

**कबील**-पुं॰ జాతి; వర్గము; సముదాయము.

**कबीला** - स्त्री॰ భార్య; पुं॰ వంశీయుల - జ్ఞాతుల వర్గము.

**कबूतर** - पुं॰ कपोत ; పావురము ; గువ్వ.

**कबूल**-पुं॰मंजूर ; అంగీకారము; మంజూరు.

**कबूलना** - स॰क्रि॰ అంగీకరించుట; స్వీకరించుట.

**कब्ज** - पुं॰ మలబద్ధకము; పిడికిలి; అధికారము; వశము.

**कब्जा** - पुं॰ मूठ ; పిడి; అధికారము; వశము; పిడికిలి.

**कब्र** - स्त्री॰ గోరి; సమాధి.

**कभी** - अव्य॰ ఎప్పుడైనా; అరుదుగా.

**कमंडल** - पुं॰ సన్యాసుల జలపాత్ర.

**कम** - वि॰ కొద్ది; కొంచెము; తక్కువ; చిన్న.

**कमची** - स्त्री॰ బెత్తము; छडी.

**कमखाब** - पुं॰ అల్లిక అలంకరణగల ఒక విధమగు పట్టువస్త్రము.

**कम-जात** - वि॰ नीच ; సంకరజాతివాడు.

**कमजोर** - वि॰ దుర్బలమగు; బలహీనమైన.

**कमजोरी** - स्त्री॰ బలహీనత.

**कमठ** - पुं॰ कछुआ ; తాబేలు.

**कमती** - स्त्री॰ कमी ; తక్కువ; తరుగు.

**कमनसीब** - अभागा-वि॰ అదృష్టములేని.

**कमनीय** - वि॰ మనోహరమైన; వాంఛింపదగిన.

**कमर** - स्त्री॰ నడుము.

**कमर टूटना**- मु॰ ఉత్సాహము కోల్పోవుట; నిరాశనొందుట; నడుము విరుగుట.

**कमर तोडना** - मु॰ నడుము విరగగొట్టుట; నిరాశపరచుట.

**कमरबंद** - पुं॰ నడుమునకు పెట్టుకొను పటకా.

**कमरा** - पुं॰ గది.

**कमलगट्टा** - पुं॰ తామరబీజము.

**कमरी** - स्त्री॰ कमली ; చిన్నకంబళి.

**कमसखुन** - वि॰ అల్పభాషి.

**कमसिन** - वि॰ చిన్న వయస్సుగల.

**कमाई** - स्त्री॰ సంపాదన; అర్జన.

**कमाऊ** -वि॰ సంపాదించువాడు; ఆర్జించువాడు.

**कमाल** - पुं॰ ప్రావీణ్యము; చమత్కారము; కుశలత. वि॰ సర్వోత్తమగు.

**कमी** - स्त्री॰ తక్కువ; లోటు.

**कमी बेशी** - स्त्री० హెచ్చుతగ్గుట.

**कमीज** - स्त्री० చొక్కా.

**कमीना** - वि० नीच ; నీచమైన; తుచ్ఛమైన.

**कमीनापन** - पुं० క్షుద్రత; హేయత.

**कयाम** - पुं० मकाम ; బస; విశ్రాంతి పొందు చోటు.

**कयामत** - पुं० ప్రళయము; ఉపద్రవము.

**कयास** - पुं० ऊहा ; ఊహ; తలపు.

**कर** - पुं० చేయి; కిరణము; తొండము; పన్ను.

**करकट** - पुं० कूडा ; చెత్త - చెదారము.

**करकच** - पुं० సముద్రపు ఉప్పు; తగాదా; పోట్లాట.

**करधा** - पुं० మగ్గము.

**करग्रह** - पुं० పాణిగ్రహణము; వివాహము.

**करणीय** - वि० కర్తవ్యము; చేయదగిన.

**करतब** - पुं० పురుషార్థము; వీరత్వము; చమత్కారము; గారడి.

**करतल** - पुं० అరచేయి.

**करतार** - पुं० సృష్టికర్త.

**करतूत** - स्त्री० करनी ; చెడుపని; హస్త లాఘవము; పని ప్రావీణ్యము.

**करधनी** - स्त्री० వడ్డాణము.

**करना** - स०क्रि० చేయుట.

**करनी** - स्त्री० करतूत ; పని; చావు.

**करपत्र** - पुं० నోటీసు ; రంపము.

**करभ** - पुं० గున్నేనుగు ; అరచేతి వెలుపలి భాగము.

**करम** - पुं० ఔదార్యము; దయ; అను గ్రహము.

**करमकल्ला** - पुं० క్యాబేజి ; पातगोभी.

**करवत** - पुं० आरा ; రంపము.

**करश्मा** - पुं० करामात ; చమత్కారము; అద్భుతమైన కార్యము ; కళ్ళతోనూ, కనుబొమల తోనూ సైగచేయుట.

**करषना** - स०क्रि० లాగుట; ఈడ్చుట.

**कराना** - स०क्रि० చేయించుట.

**कराबा** - पुं० ఒక విధమగు గాజు సీసా.

**करामत** - स्त्री० మహత్యము; గొప్పదనము; చమత్కారము.

**करामात** - स्त्री० వింతపనులు; గారడి.

**करामाती** - वि० గారడీ మనిషి.

**करार** - पुं० స్థిరత; కరారు.

**कराल** - वि० భయంకరమైన; భీతి గొలుపు ఆకారము గల.

**कराह** - पुं० నొప్పి వలన వచ్చు మూలుగు; బాధాజనితమైన మూలుగు.

**कराहना** - अ०क्रि० బాధతో మూలుగుట.

**कराहियत** - स्त्री० అరుచి; అప్రసన్నత.

**कराही** - स्त्री० दे० कडाही.

**करिणी** - स्त्री० ఆడ ఏనుగు.

**करिश्मा** - पुं० दे० करश्मा.
**करी** - पुं० ఏనుగు; स्त्री० ఇంటికప్పుకు వేయు కడ్డీ; దూలము.
**करीना** - पुं० పద్ధతి; క్రమము; అంచనా.
**करीब** - क्रि० वि० लगभग ; షుమారు; దగ్గర.
**करीबन** - क्रि०वि० షుమారుగా.
**करीम** - वि० దయాళుడు.
**करूआ** - वि० दे० कडुआ.
**करेर** - वि० కఠోరమైన.
**करेला** - पुं० కాకర.
**करेली** - स्त्री० పొట్టికాకర.
**करोड** - पुं० కోటి.
**करोड पति** - पुं० కోటీశ్వరుడు.
**कर्कश** - वी० ప్రచండమగు; కర్కశమగు; पुं० కత్తి; చెఱకు.
**कर्कशा** - स्त्री० लडाकू या झगडालू औरत ; కటుభాషిణి; తగవులమారి స్త్రీ.
**कर्ज ; कर्जा** - पुं० అప్పు ; ऋण.
**कर्जदार** - वि० ऋणी ; అప్పు తీసుకొను వాడు.
**कर्ण** - पुं० చెవి; కర్ణుడు; పడవ చుక్కాని.
**कर्णधार**-पुं० నావికుడు; పడవ నడుపువాడు; సహాయము చేయువాడు; సంచాలకుడు.
**कर्तनी** - स्त्री० కత్తెర.
**कर्ता** - पुं० చేయువాడు; కర్త.
**कर्तारि** - पुं० సృష్టికర్త; భగవంతుడు.
**कर्दम** - पुं० कीचड ; బురద; అడుసు; పాపము.
**कर्पट** - पुं० चिथडा ; చింపిరిగుడ్డ.
**कर्मकर ; कर्मकार** - पुं० కమ్మరి; కంసాలి; సేవకుడు; నౌకరు.
**कर्मशील** - वि० పట్టుదలతో పనిచేయు వాడు.
**कर्मठ** - पुं० కర్మకాండ నిర్వహించువాడు; वि० కర్మనిష్ఠుడు.
**कर्मण्य** -वि०కర్మనిరతుడు; కార్యకుశలుడైన ప్రయత్నశీలుడు.
**कर्षक**-पुं०किसान ; రైతు; వ్యవసాయకుడు.
**कर्षण** - पुं० खिंचाव ; లాగుడు; ఈడ్చుట; పొలము దున్నుట; సాగుబడి.
**कलंगी** - स्त्री० दे० कलगी.
**कल** - वि० ఆహ్లాదకరమైన; మనోహరమైన; అందమైన अव्य०రేపు; నిన్న स्त्री०యంత్రము; సుఖము; విశ్రాంతి.
**कलई** - स्त्री० తగరము; కళాయి; వెల్ల నిజము బయబడుట.
**कलईगर** - वि० కళాయి పెట్టువాడు.
**कलंक** - पुं० కళంకము; అప్రతిష్ఠ.
**कलकानि** - स्त्री० ఇబ్బంది; వ్యాకులత.

**कलछा** - पुं० ; **कलछी** - स्त्री० గరిటె.
**कलत्र** - पुं० భార్య; పత్ని.
**कलधूत** - पुं० चाँदी ; వెండి.
**कलबूत**-पुं० ढाँचा;साँचा ; అచ్చుమూస.
**कलम** - स्त्री० కీలకము; అంటు (చెట్టు)
**कलम-कसाई** - पुं० తనవ్రాత ద్వారా ఇతరులకు హాని కలిగించువాడు.
**कलमदान** - पुं० కలము, పెన్సిళ్ళు పెట్టుకొనుటకు ఉపయోగపడు పెట్టె.
**कलमा** - पुं० వాక్యము; ఇస్లాము ధర్మపు మంత్రము.
**कलमी** - वि० వ్రాసిన; అంటు (మొక్క) సంబంధమైన.
**कलरव** - पुं० మధురమైన ధ్వని.
**कलवरिया** - स्त्री० కల్లు దుకాణము.
**कलश** - पुं० కలశము; శిఖరము; ఘటము.
**कलसा** - पुं० కలశము. ఘటము.
**कलही** - वि० కలహప్రియుడు; జగడములాడువాడు.
**कला** - स्त्री० కళ; శిల్పము; శోభ; రీతి.
**कलाई** - स्त्री० మణికట్టు; ముంజేయి.
**कलाकंद** - पुं० ఒక రకమైన మిఠాయి.
**कलाकौशल** - पुं० కళాకౌశలము; కళయందు ప్రావీణ్యము.
**कलाधर** - पुं० చంద్రుడు.
**कलाप** - पुं० గుంపు; నెమలి పుచ్ఛము; అంబులపొది; చంద్రుడు; వడ్డాణము.
**कलापी** - पुं० నెమలి; కోకిల.
**कलाम** - पुं० కథనము; వాక్యము; మాట.
**कलार ; कलाल** - पुं० दे० कलवार.
**कलिंग** - पुं० ఓంఢ్ర ప్రదేశము; ఒరిస్సా ప్రాంతము.
**कलि** - पुं० కలియుగము; కలహము; యుద్ధము; పాపము.
**कलिका** - स्त्री० कली ; మొగ్గ; అంశము.
**कलित** - वि० శోభాయమానముగానున్న; అలంకరింపబడిన.
**कली** - स्त्री० మొగ్గ.
**कलुष** -पुं० పాపము; దోషము; మాలిన్యము.
**कलुषित** - वि० దూషితమైన; పాపముగు.
**कलूटा** - वि० काला ; నల్లని.
**कलेऊ** - पुं० कलेवा ; చద్ది అన్నము; ప్రాతఃకాలము చేయు అల్పాహారము.
**कलेजा** - पुं० హృదయము; వక్షస్థలము.
**कलेवर** - पुं० దేహము; శరీరము; శరీరాకారము.
**कलोर** - स्त्री० ఆవు పెయ్య.
**कलोल** - स्त्री० క్రీడ; ఉల్లాసము; ఆనందోల్లాసము.
**कलोलना** - अ०क्रि० క్రీడించుట; ఆనంద

ముతో గంతులు వేయుట.

**कल्पांत** - पुं० ప్రళయము ; कयामत.

**कल्लादराज** - वि० ఎక్కువమాట్లాడువాడు; వదరబోతు.

**कल्लोल** - पुं० అల; తరంగము; పొంగు; ఉప్పొంగించు ఆనందము.

**कल्लोलिनी** - स्त्री० నది.

**कल्हारना**-स०क्रि० भूनना ; వేయించుట.

**कवरी** - स्त्री० कबरी ; जूडा ; కొప్పు ; కేశ సమూహము.

**कवल** - पुं० कौर ; కబళము ; ముద్ద.

**कवलित** - वि० తినబడిన; మ్రింగబడిన.

**कवाट** - पुं० किवाड ; తలుపు.

**कवायद** - पुं० నియమము; నియమావళి; నిబంధన; కవాతు.

**कवायदगाह** - स्त्री० కవాతు మైదానము; సైనికుల కవాతు.

**कविराज** - पुं० శ్రేష్ఠుడగుకవి; బంగ్లాప్రాంత మున వైద్యులకుండు బిరుదులలో ఒకటి.

**कविता ; कविताई** - स्त्री० కవిత్వము; కవిత.

**कवित्व** - पुं० दे० कविता.

**कश** - पुं० కొరడా.

**कशमकश**-स्त्री०ఇటుఅటు లాగుకొనుట; నెట్టుకొనుట.వైమనస్యము; జంజాటము.

**कशा** - पुं० కొరడా త్రాడు.

**कशाघात** - पुं० కొరడా దెబ్బ.

**कशिश** - पुं० ఆకర్షణ, లాగుకొనుట.

**कश्मल**-पुं०మలినము; మూర్ఛ; మోహము.

**कषाय** - पुं० కషాయము ; వగరు.
वि० సుగంధముగల.

**कस** - पुं० పరీక్ష; బలము; గీటురాయి; ఒత్తిడి; ఒక విధమగు మొక్కు (అదిమి పట్టు) बेकस - वि० అసహాయుడు; ఆధారములేని వ్యక్తి.

**कसक** - स्त्री० ఉండి ఉండి కలుగు నొప్పి; తీపు; సానుభూతి; మర్మవేదన.

**कसनी** - स्त्री० బిగించు త్రాడు; రవిక; గీటురాయి.

**कसबल** - पुं० సామర్థ్యము; సాహసము.

**कसबा** - पुं० పెద్ద గ్రామము; చిన్న పట్టణము.

**कसबी** - स्त्री० వేశ్య.

**कसम** - स्त्री० ఒట్టు; कसम खाना ; ఒట్టు పెట్టుకొనుట; శపథము చేయుట.

**कसमसाना**-अ०क्रि० తొట్రుపాటుపడుట; వ్యాకులపడుట; త్రొక్కిసలాడుట.

**कसमसाहट**-स्त्री० कुचलाहट - త్రొక్కిస లాట; త్రొక్కిసలాట.

**कसरती** - वि० వ్యాయామము చేయువాడు; కసరత్తు చేయువాడు.

**कसरहट्टा** - पुं० కంచుపాత్రలు అమ్మే విపణి వీధి.

**कसवाना** - स०क्रि० బిగింపజేయుట.

**कसाई** - पुं० కటికవాడు; చంపువాడు; కసాయివాడు; वि० నిర్దయుడు.

**कसाना** - स०क्रि० బిగించుట; బిగింపజేయుట; अ०क्रि० చిలుమెక్కుట; ఒగరుగా నుండుట.

**कसाफत** - स्त्री० మురికి; లావు; అనాకారితనము.

**कसाव** - पुं० బిగింపు ; ఒగరు.

**कसीदा**-पुं० कशीदा; వస్త్రముపై పూలతా ఇత్యాదుల అల్లిక; ఉర్దూ లేక పారసీ భాషలో ఒకచందస్సు; ముఖస్తుతి.

**कसीर** - वि० అధికము; పెక్కు.

**कसूर**-पुं० దోషము; అపరాధము; తప్పిదము.

**कसूरमंद ; कसूरवार** - वि० దోషి; అపరాధి.

**कसैला** - वि० ఒగరుగానున్న; ఒగరైన.

**कसौटी** - स्त्री० గీటురాయి; పన్ను పరీక్ష; నిదర్శనము.

**कस्तरी** - स्त्री० పాలుకాయు మట్టిపాత్ర - పిడత లేక చట్టి.

**कस्तूर** - पुं० కస్తూరి మృగము; కస్తూరి లాంటి మృగమదము.

**कस्तूरिया** - वि० కస్తూరి రంగువంటి; కస్తూరి కలిపిన.

**कस्तूरी** - स्त्री० కస్తూరి.

**कस्ब ; कस्बी** - स्त्री० వేశ్య; గణిక.

**कस्बा** - पुं० పెద్ద గ్రామము.

**कहकहा** -पुं०अट्टहास ; అట్టహాసపు నవ్వు; పకపకలు.

**कहन** - स्त्री० కథనము; సామెత; మాట.

**कहना** - स०क्रि० చెప్పుట; మాట్లాడుట; అనుట.

**कहर** - पुं० విపత్తు; సంకటము; కరువు.

**कहवा** - पुं० కాఫీ; కాఫీ విత్తనము.

**कहाँ** - कि० वि० ఎక్కడ; ఎచ్చట.

**कहा** - पुं० చెప్పినది; మాట; కథనము; ఆదేశము.

**कहानी** - पुं० కల్పిత కథ; ఉదంతము.

**कहार** - पुं० డోలి; పల్లకి; మోసెడి ఒక జాతి లేక నీళ్ళు తెచ్చెడి ఒక జాతి.

**कहारा** - पुं० टोकरा ; బుట్ట, గంప.

**कहावत** - स्त्री० లోకోక్తి; చాటువు; సామెత.

**कहा-सुना** - पुं० చెప్పుడు మాట; వినికిడి మాట; తగనిమాట.

**कहा-सुनी** - स्त्री० వాదవివాదము; తగాదా. తకరారు.

**कही** - क्रि०वि० ఎచ్చటనో; ఎంతయో; ఒకవేళ; वि० బాగా ఎక్కువ **कही का ;**

ఎక్కడిదో; గొప్ప; कही का कही ; ఒకచోటనుండి మరియొకచోటునకు.

**काइयाँ** - वि० ధూర్తుడు; జిత్తులమారి; నీచుడు.

**कांक्षित** - वि० కోరబడిన.

**काँख** - स्त्री० చంక.

**काँच** - पुं० గాజు; स्त्री० గోచి; కాసె.

**काँचन** - पुं० బంగారము; ఉమ్మెత్త; సంపెంగ నాగకేసరము.

**कांचरी ;कांचली**-स्त्री० పాము కుబుసము.

**काँजी-हाऊस** - पुं०मवेशीखाना ; బందిల దొడ్డి.

**काँटा** - पुं० ముల్లు; చేపలు పట్టు గాలము; ముల్లుండు త్రాసు; ముల్లువలెమొన తేలి ఉండు వస్తువు; काँटा होना ; బెరడు అగుట, చిక్కి సన్నగిలుట ; పూచిక పుల్లగుట.

**काँटी** - स्त्री० చిన్నముల్లు; గాలము; చిన్న ముల్లుగల త్రాసు.

**काँठा** - पुं० ఒడ్డు; తీరము; పార్శ్వము. చిలకమెడపైనుండు ఎర్రని చార లేక గీత.

**कांता** - स्त्री० పత్ని; భార్య; ప్రియురాలు.

**कांतार** - पुं० దట్టమైన అడవి; కీకారణ్యము; ఎడారి; బంజరు భూమి.

**कांति** - स्त्री० వెల్తురు; ప్రకాశము; కాంతి; వెలుగు.

**काँपना** -अ०क्रि० కంపించుట; వణుకుట.

**काँवर** - पुं० కావడి.

**काँवरी** - स्त्री० కావడి మట్టు.

**काँवरिया** - पुं० కావడి మోయువాడు.

**काँस** - पुं० రెల్లు (గడ్డి).

**काँसा** - पुं० కంచు.

**का** - स०क्रि० యొక్క.

**काई** - स्त्री० నాచు; తీగపాచి; మలము; మురికి.

**काक** - पुं० कौआ ; కాకి.

**काकतालीय** - वि० తలవని తలంపుగా అకస్మాత్తుగా.

**काकपद** - पुं० హంసపాది; గుర్తు.

**काकल** - पुं० కంఠె ఎముక; మెడ ఎదుట కనిపించు ఎముక.

**काकली** - स्त्री० కలకలధ్వని; మధుర ధ్వని - నాదము.

**काका** - पुं० चाचा ; తండ్రి సోదరుడు - పెత్తండ్రి, పినతండ్రి.

**काकी** - स्त्री० चाची ; పెత్తండ్రి భార్య, పెత్తల్లి.

**काकु** - पुं० దెప్పిపొడుపు; వ్యంగ్యము.

**काकुल** - पुं० జుల్ఫాలు; ఉంగరాల జుట్టు.

**काग** - पुं० కాకి; బెండు; బిరడా.

**कागज** - पुं० కాగితము.

**कागजात** - पुं० (कागज का बहु०) కాగితములు; పత్రములు.

**कागा** - पुं० కాకి.

**काछ** - पुं० గోచి, కాసె, మొల.

**काछना** -स०क्रि० కాసెపోసి ధోవతి కట్టుట.

**काछनी** - स्त्री० **काछा** - पुं० కాసెపోసి కట్టిన ధోవతి; లంగోటి.

**काछी** - पुं० కూరగాయలమ్మువాడు.

**काछे** - क्रि०वि० नजदीक ; సమీపమున.

**काज** - पुं० काम ; పని; వృత్తి.

**काजर ; काजल** - पुं० కాటుక; కొడి.

**काजी** - पुं० మహమ్మదీయుల న్యాయాధీశుడు.

**काजू** - पुं० జీడిమామిడిచెట్టు; జీడి మామిడి పప్పు.

**काट** - स्त्री० కోయుపని; కత్తిరింపు పని; నమ్మకద్రోహము; టక్కరి.

**काटना**-स०क्रि० కోయుట; ఖండించుట; చంపుట; గడుపుట; దాటుట; కొట్టివేయుట; కుట్టుట (తేలు; దోమలు మొ॥) కరచుట; కొరుకుట.

**काठ** - पुं० కొయ్య; వంటచెరకు.

**काठडा** - पुं० कठौता ; కర్ర - కొయ్య కమండలము.

**काठी** - स्त्री० గుఱ్ఱపుజీను; ఒంటె వీపుపైన కూర్చుండుటకు వేయుగద్దె; కొయ్యవర.

**काढना** - स०क्रि० వెలికితీయుట; కొయ్య; రాయి; వస్త్రము మొదలగువాటి మీద పూలతలు చెక్కుట లేక అల్లుట; అప్పు తీసుకొనుట.

**काढा** - पुं० కషాయము.

**कातना** - स०क्रि० వడకుట.

**कातर** - वि० పిరికి; భయపడు.

**कादंबिनी** - स्त्री० మేఘమాల.

**कादर** - वि० భయము గలవాడు.

**कानडा** - वि० ఒంటి కన్నువాడు.

**कानन** - पुं० అడవి; ఇల్లు.

**काना** - वि० ఒంటి కన్నువాడు; వంకర.

**कानाकानी ; कानाफूसी** - स्त्री० గుసగుసలు ; చెవిలో చెప్పు రహస్యము; రహస్య సంప్రదింపు.

**कानि** - स्त्री० ప్రతిష్ఠ; సంకోచము; లోకలజ్జ.

**कानी** - वि० ఒంటికన్నుగల, స్త్రీ.

**कानून** - पुं० చట్టము; నియమము.

**कानूनगो** - पुं० గ్రామకరణము; గ్రామ లెక్కలను పరిశీలించు ఒక ప్రభుత్వ అధికారి.

**कानूनी** - वि० చట్టరీత్యా; నియమ రీత్యా; చట్టమునకనుసరించి.

**कान्ह** - पुं० కృష్ణుడు.

**कापालिक** - पुं० శైవ సంప్రదాయమునకు సంబంధించిన ఒకశాఖ.

**कापाली** - पुं० శివుడు.

**कापुरुष** - पुं० పిరికిపంద.

**काफिला** - पुं० कारवाँ ; యాత్రికుల సమూహము.

**काफी** - वि० తగినంత; చాలు; చాలినంత.

**काफूर** - पुं० కర్పూరము कफूर होना ; मु० అదృశ్యమగుట; మాయమగుట.

**काबा** - स्त्री० ముసల్మానుల తీర్థ (మక్కా యందుగల) స్థానము.

**काबिल** - वि० योग्य ; యోగ్యుడైన; సమర్థుడైన.

**काबिलियत**-स्त्री० लियाकत ; యోగ్యత; పాండిత్యము.

**काबू** - पुं० వశము; అధికారము.

**काम** - पुं० పని; కోరిక; ఉద్దేశ్యము.

**काम लगना** - मु० అవసరమైన పని కలుగుట; పని దొరకుట.

**काम-काज** - मु० పనిపాట్లు.

**कामकाजी** - वि० పనిపాటుగల.

**कामगार** - पुं० दे० कामदार.

**कामजलाऊ** - वि० పనికి ఉపకరించు.

**कामचोर** - वि० పనిదొంగ.

**कामदार** - पुं० ఏర్పరచువాడు; వ్యవస్థాపకుడు; वि० నగిషీపనిచేసిన.

**काम-धाम** - पुं० పనిపాట్లు.

**कामना** - स्त्री० కోరిక; మనోరథము.

**कामयाब** - वि० మనోరథ సిద్ధుడు; సఫలీకృతుడైన.

**कामयाबी** - स्त्री० సాఫల్యము సిద్ధి; కృతార్థత.

**कामरी** - स्त्री० కంబళి.

**कामारि** - पुं० శివుడు.

**कामिनी** - स्त्री० అంగన; మద్యము.

**काय ; काया** - स्त्री० శరీరము; దేహము.

**कायदा** - पुं० नियम ; నియమము; నిబంధనము; ఉర్దూ భాష నేర్పు ప్రారంభిక పుస్తకము.

**कायम** - वि० స్థిరమైన.

**कायम-मुकाम** - वि० ఒకని బదులుగా అతని పనిని కొంతకాలము వరకు చేయ వచ్చిన.

**कायर** - वि० डरपोक ; పిరికి.

**कायरता** - स्त्री० भीरुता ; పిరికితనము.

**कायल** - वि० హేతుబద్ధమైన; సత్యమును అంగీకరించువాడు.

**कायस्थ** - पुं० హిందువులలో ఒక జాతి.

**काया** - स्त्री० శరీరము.

**काया-कल्प** - पुं० వృద్ధాప్యమును పోగొట్టి యవ్వనము ప్రసాదించునని చెప్పబడు ఒక

దివ్య ఔషధము.

**कार** - पुं॰ - పని स्त्री॰ మోటారు కారు.

**कारखाना** - पुं॰ ఫ్యాక్టరీ; కర్మాగారము; యంత్రశాల కార్యాలయము.

**कारगर** - वि॰ ఫలప్రదమైన; గుణము నిచ్చు; ఉపయోగకరమైన; ప్రభావశాలి.

**कारगुजार** - वि॰ సవ్యముగా పనిచేయువాడు; కర్తవ్యము నిర్వహించువాడు.

**कारगुजारी** - स्त्री॰ కార్యము సాధించు ప్రావీణ్యము కలిగి యుండుట; కార్య నిర్వహించు సామర్థ్యము.

**कारज** - पुं॰ दे॰ कार्य.

**कारतूस** - पुं॰ తోటా.

**कारन** - पुं॰ कारण ; కారణము.

**कारनामा** - पुं॰ చేసిన పనుల వివరణ.

**कारनी** - पुं॰ ప్రేరేపించువాడు; రెచ్చగొట్టు వాడు; చేయువాడు.

**कारबार** - पुं॰ వ్యాపారము; పనిపాటు; వృత్తి.

**कारबारी** - पुं॰ వ్యాపారి; పనిపాటులు చేయువాడు; శ్రమించువాడు.

**कारवाँ** - पुं॰ काफिला ; ఒక దేశమునుండి మరియొక దేశము వెళ్ళు వ్యాపారుల సమూహము.

**कारा** - स्त्री॰ ఖైదు; బంధనము; క్లేశము.

**कारागार ; गारागृह** - पुं॰ ఖైదు; చెర.

**कारी** - पुं॰ చేయువాడు वि॰ లోతైన; ప్రాణాంతకమైన; అమోఘమైన.

**कारीगर** - पुं॰ శిల్పి; చేతి పని నిష్ణాతుడు.

**कारीगरी** - स्त्री॰ హస్తకార్యనైపుణ్యము; శిల్ప ప్రావీణ్యము.

**कारूँ का खजाना** - पुं॰ అపారమైన సంపద - ఖజానా.

**कार्यवाह; कार्यवाहक** -पुं॰ కార్యభారము చేపట్టువాడు; కార్యదర్శి.

**कार्रवाई** - स्त्री॰ कार्यवाही చర్య; కార్య తత్పరత; కార్యము; ఎత్తు; కార్యదక్షత.

**काल** - पुं॰ సమయము; కాలము; వ్యవధి; మృత్యువు; యముడు; అంతము.

**काला** - वि॰ నల్లని; కలుషితమైన; కళంకిత మైన; **काला चोर** - मु॰ గజదొంగ; **काला पानी** - मु॰ దేశ బహిష్కార దండన; ద్వీపాంతర వాస శిక్ష.

**कालापन** - पुं॰ నలుపు.

**कालिंदी** - स्त्री॰ యమునానది.

**कालिख** - स्त्री॰ బొగ్గు; సిరా; నలుపు; కళంకము.

**कालिब** - पुं॰ దేహము; టోపీలు బాగు చేయు అచ్చు.

**कालिमा** - पुं॰ నల్లదనము; దూషణ; కళంకము.

**काली** - स्त्री० కాళికాదేవి; దుర్గాదేవి.
**कालीदह** - पुं० కాళిందిమడుగు.
**कालीन** - पुं० తివాచి ; జంపఖానా ; वि० కాలమునకు సంబంధించిన.
**कालीमिर्च** - स्त्री० మిరియములు.
**काशाना** - पुं० झोंपडी - గుడిసె; ఇల్లు.
**काश्त** - स्त्री० సేద్యము; సాగు; కౌలు హక్కు.
**काश्तंकार** - पुं० కర్షకుడు; కృషీవలుడు; రైతు.
**काश्तकारी** - स्त्री० సేద్యము; సాగు; కృషి.
**काश्मीरा** - पुं० ఒకవిధముగు ఉన్ని వస్త్రము.
**काष** - पुं० సానరాయి.
**काषाय** - वि० కాషాయరంగు.
**काष्ठ** - पुं० వంట చెరుకు; కర్ర; కట్టె.
**कास** - पुं० రెల్లుగడ్డి; దర్భ.
**काह**-क्रि० वि०ఏమి; ఏది; स्त्री०చీపురుపుల్ల; ఎండుగడ్డి.
**काहिल** - वि० आलसी ; సోమరి.
**काहिली** - स्त्री० सुस्ती ; సోమరి తనము.
**काहे** - अव्य० ఏల; ఎందుకు.
**किंकर** - पुं० సేవకుడు.
**किंकतव्य विमूढ** - वि० కర్తవ్యము తోచనివాడు.
**किंकणी** -स्त्री०గజ్జె; చిరుగంట; వడ్డాణము.
**किंचन** - पुं० ढाक ; మోదుగచెట్టు; చిన్న వస్తువు.
**किंचित** - वि० కొంచెము; కొద్ది; స్వల్పము.
**किंतु ; किन्तु** - अव्य० కాని; పైగా; ఇక నేమనగా.
**किंवदंती** - स्त्री० పుకారు ; నానుడి; వదంతి.
**किंवा**-अव्य० अथवा; లేనిచో; అయినను; అథవా.
**किंशुक** - पुं० ढाक ; మోదుగు.
**कि** -अव्य० ఏమనగా; ఇంతలో; అని.
**किचकिच** - स्त्री० జగడము; వ్యర్థపు ప్రేలుడు.
**किचकिचाना** - अ०क्रि० (కోపముతో) పల్లు పట పట కొరుకుట.
**किचपिच** - वि० అస్పష్టము.
**कितना** - वि० ఎంత ఎంత మాత్రము ?
**किताब** - स्त्री० పుస్తకము.
**किताबत** - स्त्री० వ్రాత; వ్రాయుట.
**किताबी** - वि० పుస్తక సంబంధమైన.
**किताबी कीडा** - पुं० పుస్తకపు పురుగు; ఎల్లప్పుడు పుస్తకములు చదువువాడు.
**किताबी चेहरा** - पुं० కోలముఖము.
**किधर** - क्रि०वि० ఎటు; ఏవైపు.
**किनारा** - पुं० ఒడ్డు; అంచు; కొన.
**किनारा-कश** - वि० జోక్యము కలిగించు

కొననివాడు.

**किनारदार** - वि॰ అంచుకలిగిన.

**किनारी** - स्त्री॰ వెండి లేక (బంగారు) జరీ అంచు.

**किफायत** - स्त्री॰ పొదుపు; మిత వ్యయము.

**किफायती**-वि॰ పొదుపు చేయు; మితముగా వ్యయము చేయు.

**किमाश** - पुं॰ పద్ధతి; రీతి.

**किम्मत** - स्त्री॰ कीमत ; వెల; ఖరీదు.

**किरकिरी** - स्त्री॰ నలుసు; దూళికణము; కంటి నలుసు; అవమానము.

**किरकिराना** -अ॰क्रि॰ మొరమొరలాడుట.

**किरकिरा होना** - मु॰ పానకములో పుల్ల వచ్చు చందమున రసభంగమగుట.

**किरराना** - अ॰क्रि॰ పల్లుకొరుకుట.

**किरण** - स्त्री॰ కాంతి కిరణము.

**किरात** - पुं॰ కిరాత జాతి మనిషి - భిల్లుడు?

**किरातिनी** - स्त्री॰ కిరాత జాతి (స్త్రీ).

**किराना** - पुं॰ ఉప్పు; పప్పు; పోపు సామాను మొ. పదార్థములు. **स॰क्रि॰** తూర్పార పోయుట; చెరుగుట.

**किरानी**-पुं॰ యూరపు వాసులకు; ఆసియా ఖండవాసులకును; సంకర జాతి వారును.

**किराया** - पुं॰ అద్దె; బాడుగ.

**किरासन** - पुं॰ కిరసనాయిలు.

**किरिया** - स्त्री॰ శ్రాద్ధకర్మ; ఒట్టు; కర్తవ్యము; శపథము.

**किरीट** - पुं॰ కిరీటము.

**किलकार;किलकारी**-स्त्री॰ హర్షధ్వని; నవ్వు శబ్దము.

**किलकिल** - स्त्री॰ జగడము; ఘర్షణ.

**किलना**-अ॰क्रि॰ కట్టుబడుట; చేజిక్కుట.

**किला** - पुं॰ కోట; దుర్గము.

**किल्लत** - स्त्री॰ సంకోచము; ఇబ్బంది; లోటు.

**किवाड ; किवार** - पुं॰ తలుపు.

**किशमिश**-स्त्री॰किसमिस; కిస్‌మిస్‌పండు; ఎండు ద్రాక్ష.

**किशलय** - पुं॰ पल्लव ; చిగురుటాకు.

**किशोर** - पुं॰ 12-15 సంవత్సరముల మధ్య వయసు బాలుడు.

**किशोरी** - स्त्री॰ 11-14 మధ్య వయసుగల బాలిక, కన్య.

**किश्त** - स्त्री॰ వాయిదా పైకము; చదరంగపు ఆటలో రాజు పావుచేతిలో చిక్కుట - దీనినే 'షా' అని అందురు.

**किश्ती** - स्त्री॰ नाव ; నావ. किश्ती नुमा - పడవ ఆకారము గల; పడవ మాదిరి.

**किसलय** - पुं॰ కిశలయము; చిగురుటాకు.

**किसान** - पुं॰ కర్షకుడు; వ్యవసాయదారుడు.

**किसानी** - स्त्री० खेती ; వ్యవసాయము; కృషి.

**किस्त** - स्त्री० వాయిదా పైకము.

**किस्तवार** - क्रि०वि० వాయిదాల ప్రకారము; వాయిదాల వంతున.

**किस्म** - स्त्री० రకము; విధము; పద్ధతి; ప్రకారము.

**किस्मत** - स्त्री० नसीब ; అదృష్టము; ప్రారబ్ధము.

**किस्मत आजमाना** - पुं० అదృష్టమును పరీక్షించుట.

**किस्मत चमकना** - पुं० అదృష్టము అను కూలించుట.

**किस्मत फूटना** - पुं० అదృష్టము సన్న గిల్లుట.

**किस्मतवर** - वि० नसीबवर ; అదృష్ట వంతుడు.

**किस्सा** - स्त्री० కథ; వృత్తాంతము; జగడము.

**कीकर** - पुं० बबूल ; తుమ్మచెట్టు.

**कीट** - पुं० कीडा ; కీటకము; పురుగు.

**कीडा** - पुं०दे० कीट.

**कीडी** - स्त्री० చిన్న పురుగు.

**कीना** - पुं० ద్వేషము; వైరము.

**कीमत** - स्त्री० दर ; వెల, ధర.

**कीमती** -वि० ఎక్కువ వెలగల; ప్రియమైన.

**कीरति** - स्त्री० दे० कीर्ति.

**कीर्तन** - पुं० కీర్తన; పొగడ్త; భజన.

**कील** - स्त्री० మేకు; గూటము; గసిక; ముల్లు.

**कीलना** - स०क्रि० మేకు దిగకొట్టుట; గుంజ పాతుట; గసిక దిగ కొట్టుట; వశపరచుకొనుట; మంత్ర ప్రభావమును తగ్గించుట.

**कीला** - पुं० ముల్లు; గూటము; పెద్దమేకు.

**कीलित** - वि० దిగగొట్టబడిన; బంధింప బడిన; కట్టబడిన; మంత్ర ప్రభావముచే వశపరచుకొనబడిన.

**कीली** - स्त्री० చిన్నమేకు; ఇరుసు.

**कीश** - पुं० కోతి; సూర్యుడు; పక్షి.

**कीसा** - पुं० సంచి; జేబు; కోతి.

**कुँअर** - पुं० బాలుడు; రాకుమారుడు

**कुअरि** - स्त्री० బాలిక; రాకుమారి.

**कुँआ** - पुं० బావి; నుయ్యి.

**कुँआरा** - पुं० పెళ్ళికానివాడు.

**कुँआरी** - स्त्री० కన్య; పెళ్ళికాని పిల్ల.

**कुंकुम** - पुं० కుంకుమ; సింధూరము; కుంకుమ పువ్వు.

**कुंचन** - पुं० ముడుచుకొనుట; కుంచనము; వంకరగుట.

**कुंचिका** - स्त्री० వెదురురెమ్మ; తాళపుచెవి.

**कुंचित** - पुं० ముడుచుకొనిన; ముడుచు

కొన్న; వంకరైన.

**कुंज** - पुं० పొదరిల్లు; ఒడ్డు; మూల.

**कुंजडा** - पुं० కూరగాయలమ్ము వృత్తి చేయు వాడు.

**कुंजर** - पुं० ఏనుగు; శ్రేష్ఠమైన.

**कुंजी** - स्त्री० चाभी ; తాళపు చెవి.

**कुंडल** - पुं० చెవులకు ధరించు పోగులు; గుండ్రము.

**कुंडलाकार** - वि० గుండ్రని ఆకారముగల.

**कुंडलिया** - स्त्री० ఒక విధమగు హిందీ ఛందము లేక పద్యము; ఒక విధమగు మాంసగ్రంధి.

**कुंडली** - स्त्री० జన్మపత్రిక; జాతక చక్రము.

**कुंडा** - पुं० పెద్దకుండ; నాగవాసము - తలుపు కొక్కెము లేక గొళ్ళెము.

**कुंडी** - स्त्री० గొళ్ళెము (తలుపు); రాచిప్ప.

**कुंत** - पुं० ఈటె; బల్లెము; పేను.

**कुंदरू** - पुं० దొండకాయ లేక తీగ.

**कुंदा** - पुं० కొయ్యమొద్దు; తుపాకి మడమ; పాలఖోవా.

**कुंभी** - पुं० ఏనుగు; మొసలి; కుంభీపాక నరకము ; గుగ్గలము; स्त्री० చిన్న వంట కుండ.

**कुंभीपाक** - पुं० ఒక విధమగు నరకము.

**कुँवर** - पुं०दे० कुँअर.

**कुँवारा** - वि०दे० कुँआरा.

**कुँवाँ** - पुं०दे० कुँआ.

**कुआर** - पुं० ఆశ్వయుజ మాసము.

**कुइयाँ** - स्त्री० చిన్న నుయ్యి.

**कुई** - स्त्री० చిన్నబావి ; తెల్లకలువ.

**कुकर्म** - पुं० చెడుపని; చెడునడత; పాప కార్యము.

**कुकर्मी** - वि० పాపి; చెడు నడతగలవాడు.

**कुकर खाँसी** - स्त्री० కోరింత దగ్గు; పొడి దగ్గు.

**कुकुर दाँत** - पुं० గొగ్గిపన్ను.

**कुकुरमुत्ता** - पुं० కుక్కగొడుగు; పుట్టకొక్కు.

**कुकुरौंधी** - स्त्री० दे० कुकुरमाछी.

**कुख्यात** - वि० बदनाम ; చెడుపేరుగల.

**कुगति** - स्त्री० దుర్గతి; దుర్దశ.

**कुघात** - पुं० మోసము; చెడ్డదోటు; అననుకూల ప్రదేశము.

**कुचक्र** - पुं० षडयन्त्र ; కుట్ర.

**कुचलना**-स०क्रि० త్రొక్కుట, కాలరాయుట; దంచుట.

**कुचाल** - स्त्री० చెడునడత; దురాచరణము; దుర్మార్గము.

**कुचाली** - वि० దుష్టుడు; దుర్మార్గుడు.

**कुचेष्टा** - स्त्री० చెడునడత; దుర్మార్గము.

**कुचेल** - पुं० మురికిగుడ్డ.

**कुचैल** - वि० మురికిగుడ్డలవాడు; पुं० మురికి గుడ్డ

**कुछ** - वि० కొంచెము; కొద్ది; కొన్ని.

**कुछएल** - वि० थोडा सा ; కొలది.

**कुछ ऐसा** - वि० విలక్షణమైన; విశిష్టమైన; అసామాన్యమైన.

**कुछ का कुछ** - वि० విపరీతముగా; ఒక దానికి మరొకటిగా ; అసంగతముగా.

**कुछ कुछ** - क्रि०वि० కొద్దికొద్దిగా; కొందరు కొందరుగా.

**कुछ न कुछ** - क्रि०वि० थोडा-बहुत ; ఒకించుక.

**कुजोग** - पुं० చెడుసాంగత్యము; చెడు యోగము; చెడుకాలము.

**कुटनहारी** - स्त्री० వడ్లు దంచు స్త్రీ; దంపుడు స్త్రీ.

**कुटवाना** - स०क्रि० దంపించుట.

**कुटाई** - स्त्री० దంపుడు; దంపుడు కూలి.

**कुटिया** - स्त्री० చిన్న గుడిసె.

**कुटिलता** - स्त्री० కపటము; వంచన.

**कुटिलपन** - पुं० ; **कुटिलाई** - स्त्री० వక్ర బుద్ధి; దుష్టత.

**कुटी** - स्त्री० ; **कुटीर** - पुं० కుటీరము; గుడిసె.

**कुटुंब** - पुं० కుటుంబము; పరివారము.

**कुटेव** - स्त्री० దురభ్యాసము; దురలవాటు; మొండిపట్టు.

**कुटौनी** - स्त्री० వడ్లదంపు.

**कुठाँव** - स्त्री० చెడు స్థలము; చెడ్డచోట్లు.

**कुठार** - पुं० గొడ్డలి ; గండ్రగొడ్డలి ; वि० నాశము చేయు.

**कुठाराधात** - पुं० గొడ్డలిపెట్టు; గొడ్డలిదెబ్బ; తీవ్రమైన ఆఘాతము.

**कुठारी** - स्त्री० చిన్న గొడ్డలి.

**कुठिया** - स्त्री० ; **कुठिला** - पुं० చిన్న ధాన్యపు గాదె.

**कुठौर** - पुं० చెడ్డచోటు; అదును కాని అదను.

**कुडकुडाना ; कुडबुडाना** - अ०क्रि० లోలోన కుములుట; ఇష్టములేనిది విని లేక చూచి లోలోపల బాధనొందుట. स०क्रि० పొలమునుండి పిట్టలను లేక మృగములను పారద్రోలుట.

**कुडौल** - वि० వికృతాకారము.

**कुढँग** - पुं० చెడు పోకడ; చెడు పద్ధతి.

**कुढन** - स्त्री० మనస్సులోని మధన; లోలోన రగులుచుండు క్రోధము; కుళ్ళు (కోపము ఈర్ష్య వల్ల కలుగు) మనస్తాపము.

**कुढना** - अ०क्रि० లోలోన కుళ్ళుట - లోలోన ఈర్ష్య లేక క్రోధము వలన బాధ నొందుట.

**टेक** - स्त्री॰ పోటీకర్ర; ప్రతిజ్ఞ; అలవాటు; మొండిపట్టు.

**टेकना** - स॰क्रि॰ ఆనుకొనుట; పట్టు పట్టుట.

**टेकनी** - स्त्री॰ పోటీకర్ర.

**टेढाई** - स्त्री॰ వంకర; వంపు; వక్రత.

**टेढापन** - पुं॰ दे॰ टेढाई.

**टेढा-मेढा** - वि॰ వంకరగానున్న.

**टेरना** - स॰क्रि॰ కేకవేసి పిలుచుట; ఉచ్చ స్వరముతో పాడుట; గడుపుట.

**टेव** - स्त्री॰ అలవాటు; స్వభావము.

**टेसू** - पुं॰ ढाक ; మోదుగ (చెట్టు)

**टोंचना** - स॰क्रि॰ चुभाना ; గ్రుచ్చుట; నాటుట.

**टोंटी**-स्त्री॰ జంతువుల ముట్టె; నీటిగొట్టము; కొమ్ము చెంబు కొమ్ము లేక పీక.

**टोकना** - स॰क्रि॰ మాట్లాడునప్పుడు అడ్డు ప్రశ్నలు వేసి ఆపుట జ్ఞాపకము చేయుట; దిష్టిపెట్టుట.

**टोकरा** - पुं॰ వెదురు బుట్ట లేక తట్ట.

**टोकरी** - स्त्री॰ చిన్న వెదురు బుట్ట లేక తట్ట.

**टोटा** - पुं॰ నష్టము; ఫిరంగితూటా.

**टोना** - पुं॰ మంత్రతంత్ర ప్రయోగము; గారడీ.

**टोप** - पुं॰ శిరస్త్రాణము; పెద్ద టోపి.

**टोपी** - स्त्री॰ టోపి.

**टोरना** - स॰क्रि॰ तोडना ; విరుచుట; **आँख टोरना** - मु॰ సిగ్గుతో తల తిప్పు కొనుట.

**टोल** - पुं॰ సమూహము; మండలి; స్థానీయ శాసకులు వేయు పన్ను.

**टोह** - स्त्री॰ వెతుకుడు; అన్వేషణ; జాడ.

**टोहना** - स॰क्रि॰ వెతుకుట; అన్వేషించుట; జాడతీయుట.

**टोहिया ; टोही** - पुं॰ జాడతీయువాడు; గుప్తచరుడు.

## ठ

**ठंड ; ठंढ** - स्त्री॰ శీతలవాయువు; చలి; నెమ్మి.

**ठंडा ; ठंढा** - वि॰ చల్లని.

**ठंढी साँस** - पुं॰ నిట్టూర్పు.

**ठंडाई ; ठंढाई** - स्त्री॰ శరీరపు ఉష్ణము తగ్గించి చల్లపరచు ఔషధము; నూరిన భంగు ఆకు.

**ठंढई** - स्त्री॰ दे॰ ठंडाई.

**ठकुरसुहाती** -स्त्री॰ खुशामद ; ముఖస్తుతి.

**ठकुरायत**-स्त्री॰ ప్రభుత్వము; ఆధిపత్యము.

**ठग** - पुं॰ ప్రవంచకుడు; మోసగించి ఇతరుల సొత్తును అపహరించువాడు.

**ठगई** - स्त्री॰ दे॰ ठगपना.

**ठगना** - स॰क्रि॰ మోసగించుట; వంచించి

అపహరించుట.

**ठगनी** - स्त्री० ప్రవంచకుని భార్య; మోసకత్తె; తార్పుడు స్త్రీ.

**ठगोरी** - स्त्री० మాయ; గారడీ.

**ठटरी** - स्त्री० అస్థిపంజరము; పాడె.

**ठट्ठा** - पुं० అట్టహాసము; వేళాకోళము; పరిహాసము; **ठट्ठेबाज**-वि०పరిహాసము చేయువాడు.

**ठठरी** - स्त्री० दे० ठटरी.

**ठठेरा** - पुं० कसेरा ; కంచరి.

**ठठोली** - स्त्री० दिल्लगी ; పరిహాసము.

**ठनठनगोपाल** - पुं० నిష్ఠదరిద్రుడు; ధనాభావము; లేమి.

**ठनना** - अ०क्रि० సన్నద్ధమగుట; పొసగుట; స్థిరపడుట.

**ठसक** - स्त्री० గీర; దర్పము.

**ठसकदार** - वि० గర్విష్ఠి; అభిమానము గల; గీరగల.

**ठसाठस** - क्रि०वि० खचाखच ; కూరి కూరిన; పూర్తిగా నిండిన; క్రిక్కిరిసిన.

**ठहरना** - अ०क्रि० ఆగుట; ఉండుట; నివసించుట. **मन ठहरना** - मु० మనస్సు అనుకూలత లేకపోవుట.

**ठहराऊ** - वि० टिकाऊ ; మన్నికగల; ఆగునట్టి.

**ठहराव** - पुं० నిశ్చయము; నిర్ధారణ.

**ठहाका** - पुं० అట్టహాసము; పకపకనవ్వుట.

**ठाउँ** - स्त्री० दे० ठाँयँ.

**ठाँयँ** - पुं० ; स्त्री० స్థలము; స్థానము ; చోటు; దగ్గర.

**ठावँ** - पुं०; स्त्री० ठिकाना ; స్థానము.

**ठानना** - स०क्रि० సంసిద్ధమగుట; దృఢముగా నిశ్చయించుట.

**ठाली** - वि० పనిలేని; ఏమీ చెయ్యని.

**ठिकाना** - पुं० ठौर ; చోటు; ఆశ్రయము.

**ठिठकना** - अ०क्रि० తటాలున ఆగుట; నిలుచుట.

**ठिठरना ; ठिठुरना** - अ०क्रि० ఎక్కువ చలివలన అంగ ప్రత్యంగములు వంకరలు పోవుట.

**ठीक** - वि०సరైన; ఉచితమైన; ఉపయుక్తమైన. पुं० నిశ్చయము; సరిఅయిన విషయము.

**ठीकठाक** - पुं० ఏర్పాటు; నిశ్చయము; పక్కా విషయము.

**ठीकरा** - पुं० కుండ పెంకు; భిక్షాపాత్ర.

**ठीका** - पुं० ठेका ; కాంట్రాక్టు; గుత్త.

**ठीकेदार** - पुं० ठेकेदार ; ఇజారాదారుడు.

**ठुंठ** - पुं०दे० ठूंठ.

**ठुकना**-अ०क्रि० ठोका जाना ; చొచ్చుట; దిగగొట్టబడుట; కొట్టబడుట; నష్ట

పడుట.

**ठुकराना** - स०क्रि० తన్నుతన్నుట; తిరస్కరించుట; తుచ్ఛమని తలచి తిరస్కరించుట.

**ठुड्डी** - स्त्री० గడ్డము; విచ్చని పేలపు గింజ.

**ठुनकना** - अ०क्रि० వెక్కివెక్కి ఏడ్చుట; ఏడుపును నటించుట; ఏదైనా వస్తువు కొరకు పిల్లలు మారాము పెట్టి ఏడ్చుట.

**ठुमक** - स्त्री० ఉల్లాసముతో దగ్గర దగ్గరగా అడుగులు వేస్తూ నడచుట; గీరనడక.

**ठुमकना** - अ०क्रि० పిల్లలు కుప్పిగంతులు వేస్తూ ఉల్లాసముగా నడుచుట; కాలి మువ్వలు మ్రోగునట్లు వేళ్ళు విసురుతూ నృత్యము చేయుట.

**ठुमरी** - स्त्री० చిన్న గేయము.

**ठूँठ** - पुं० మోడు.

**ठूँठा** - वि० ఆకులు; కొమ్మలు రెమ్మలు లేని (మోడు) చెయ్యిలేని.

**ठेंठी** - स्त्री० చెవిగులిమి; బిరడా.

**ठेका** - पुं० दे० ठीका.

**ठेठ** - वि० విశుద్ధమైన; అచ్చమైన; स्त्री० గ్రామ్యభాష.

**ठेलना** - स०क्रि० ముందుకు నెట్టుట; నెట్టితోయుట.

**ठेला** - पुं० నెట్టుడుబండి; సామానువేసి మనుష్యులు తోయుబండి.

**ठेस** - स्त्री० దెబ్బ; క్లేశము.

**ठोंक** - स्त्री० ఆఘాతము.

**ठोंकना ; बजाना** - मु० పరిక్షించుట.

**ठोंक बजाकर** - मु० సరిగా పరిక్షించి; అందరితో చెప్పి.

**ठोंकना** - स०क्रि० బాగా కొట్టుట; కొట్టి కొట్టి దూర్చుట లేక పాతుట.

**ठोकर** - स्त्री० ఎదురుదెబ్బ.

**ठोडी** - स्त्री० గడ్డము.

**ठोस** - वि० బోలులేని లేక బోలుకాని; ప్రబలమైన; గట్టి.

**ठौर** - पुं० जगह ; స్థానము; చోటు; అదను వీలైన సమయము.

## ड

**डंक** - पुं० కొండె (తేలు మొ॥) కలము పాళి.

**डंका** - पुं० డోలు; ఢంకా.

**डंठल** - पुं० మొక్క కాడ.

**डंड** - पुं० डंडा ; కర్ర (చేతి) దండెము అనబడు కసరత్తు.

**डंडा** - पुं० చేతి కర్ర; ప్రహరీ గోడ.

**डंडी** - स्त्री० చిన్న చేతి కర్ర; చాడీకోరు; త్రాసు దండి.

**डंडीमार** - वि० తూకములో మోసము చేయువాడు.

**डंसना** - स॰क्रि॰ दे॰ डसना.

**डकार** - पुं॰ త్రేన్పు.

**डकारना** - अ॰क्रि॰ త్రేన్చుట; జీర్ణించుకొనుట; గర్జించుట.

**डकैत** - पुं॰ బందిపోటు దొంగ.

**डकैती** - स्त्री॰ బందిపోటు దొంగతనము; దోపిడి.

**डग** - पुं॰ అడుగు; అంగ.

**डगमगाना** - अ॰क्रि॰ ఇటూ అటూ కదులుట; చలించుట; ఊగిసలాడుట.

**डगडोर** - वि॰दे॰ डाँवाँडोल.

**डगर** - स्त्री॰ దారి; మార్గము.

**डटना** - अ॰क्रि॰ దృఢముగా నిలబడుట; సిద్ధముగా నిలబడి ఉండుట.

**डपट** - स्त्री॰ डाँट ; బెదిరింపు; చీదరింపు; గుఱ్ఱపు విసురు గతి.

**डफ ; डफला** - पुं॰ డప్పు.

**डबडबाना** - अ॰क्रि॰ అశ్రుపూర్ణమగుట.

**डबरा** - पुं॰ చిన్న నీటిగొయ్యి; గుంట; చిన్న జలాశయము.

**डबल** - वि॰ రెట్టింపు.

**डर** - पुं॰ భయము.

**डरना** - अ॰क्रि॰ భయపడుట.

**डरपना** - अ॰क्रि॰ दे॰ डरना.

**डराना** - स॰क्रि॰ భయపెట్టుట.

**डरावना** - वि॰ భయంకరమైన.

**डसन** - स्त्री॰ కుట్టుట (తేలు మొ॥).

**डसना** - తేలు; దోమ మొ॥ కొండెతో కుట్టుట.

**डाँट** - स्त्री॰ గద్దింపు; బెదిరింపు; శాసనము.

**डाँटना** - स॰क्रि॰ బెదిరించుట; అదిలించుట.

**डाँठ** - पुं॰दे॰ डंठल.

**डाँड** - पुं॰ పడవనడుపు గడ; ఎత్తుగట్టు; జుర్మాన.

**डाँडना** - स॰क्रि॰ జుర్మానావేయుట.

**डाँडा** - पुं॰ చేనుగట్టు; పడవతోయుగడ; దుడ్డుకఱ్ఱ; సరళరేఖ.

**डाँडी** - स्त्री॰ పొడుగుపాటి సన్నని కఱ్ఱ; త్రాసుదండి; డోలీ సరళరేఖ.

**डाँवाँडोल** - वि॰ అస్థిరమైన; ఇటూ అటూ ఊగులాడు.

**डाइन** - स्त्री॰ భూతము; పిశాచము; దయ్యపు స్త్రీ; మంత్రగత్తె.

**डाक** - स्त्री॰ టపా; వాంతి; ఏలముపాట.

**डाकखाना** - पुं॰ పోస్టాఫీసు.

**डाकगाडी** - स्त्री॰ టపాబండి.

**डाक-घर** - पुं॰दे॰ डाकखाना.

**डाकबंगला** - पुं॰ రహదారి; బంగళా.

**डाका** - पुं॰ దారిదోపిడి; లూటి.

**डाकाजनी** - स्त्री० डकैती ; దారి దోపిడి; కొల్లకొట్టుట.

**डाकिन ; डाकिनी** -स्त्री०దయ్యము; క్రూర స్వభావముగల స్త్రీ; కాళీఅమ్మవారి సహచరి.

**डाकिया** - पुं० తపాలా బంట్రోతు.

**डाकू** - पुं० దారిదోపిడి దొంగ; బందిపోటు దొంగ.

**डाट** - स्त्री० బిరడ; ఊతము.

**डाढ** - स्त्री० దంతములు; దంతపు కోరలు.

**डाभ**-पुं० లేతకొబ్బరికాయ; బొండాం; దర్భ.

**डामर** - पुं० ఆడంబరము; చమత్కారము; ఒక విధమగు జిగురు.

**डायन** - स्त्री०दे० डाइन.

**डायरी** - स्त्री० रोजनामचा ; డైరి.

**डाल** - स्त्री० చెట్టు కొమ్మ; శాఖ.

**डालना** - स०क्रि० వేయుట; పారవేయుట; విసరివేయుట.

**डाली** - स्त्री० చిన్న కొమ్మ; పెద్దలకు గౌరవార్థమై కానుకగా పంపబడు పండ్ల బుట్ట.

**डावरा** - पुं० బాలుడు; కుమారుడు.

**डावरी** - स्त्री० బాలిక; కుమార్తె.

**डासन** - पुं० పక్క; శయ్య.

**डासना** - स०क्रि० పరచుట (పక్క); వ్యాపింపజేయుట ; కరచుట (పాము).

**डासनी** - स्त्री० మంచము.

**डाह** - स्त्री० ఈర్ష్య; ద్వేషము.

**डाही** - वि० ఈర్ష్యించువాడు; ద్వేషించువాడు.

**डिंगर** - पुं० స్థూలకాయుడు; దుష్టుడు; కొంటెవాడు; దాసుడు.

**डिंगल** - पुं० రాజస్థాను ప్రాంతపు భాష - ఒకప్పటి కావ్యభాష वि० నీచమైన; తుచ్ఛమైన.

**डिग्गी** - स्त्री० చెరువు; సాహసము.

**डिबिया** - स्त्री० చిన్న డబ్బా లేక భరణి.

**डिब्बा** - पुं०మూతగల డబ్బా; రైలు పెట్టె.

**डींग** - स्त्री० बडाई ; బడాయి.

**डीठ** - स्त्री० దృష్టి; చూపు.

**डील** - स्त्री० శరీరాకారము.

**डील-डौल** - पुं० శరీరపు ఆకార ప్రకారము; దేహము; శరీరపు ఒడ్డు - పొడుగు.

**डुबकी** - स्त्री० गोता ; మునుక.

**डुबाना ; डुबोना** - स०क्रि० ముంచుట వినష్టపరచుట; నాశముచేయుట.

**डुलना** - अ०क्रि० కదలుట; చరించుట.

**डुलाना** - स०क्रि० కదిలించుట; చలింపజేయుట.

**डूबना** -अ०क्रि० మునుగుట; అస్తమించుట.

**डेढ** - वि० ఒకటిన్నర. $1^{1/2}$

**डेरा** - पुं० पडाव ; కొద్దిరోజుల మకాము; డేరా.

**डेली** - स्त्री० डलिया ; दे० डाली.

**डैन ; डैना** - पुं० పక్షిరెక్క.

**डोंगी** - स्त्री० చిన్న పడవ.

**डोर** - स्त्री० ; **डोरा** - पुं० దారము.

**डोलची** - स्त्री० చిన్న ఉయ్యాల.

**डोलना** - अ०क्रि० కదలుట; చలించుట.

**डोलाना** - स०क्रि० కదిలించుట; చలింపజేయుట.

**डोली** - स्त्री० పల్లకీ.

**डौंडी** - स्त्री० ढिढोरा ; చాటింపు.

**डौंडी देना** - पुं० చాటింపు వేయుట.

**डौल** - पुं० పద్ధతి; ఆకారము.

**डौलदार** - वि० అందమైన; మంచి ఆకారము గల.

## ढ

**ढंकना** - स०क्रि० మూయుట; మూత పెట్టుట.

**ढंग** - पुं० పద్ధతి; ప్రకారము; శైలి; యుక్తి; వంచన.

**ढंगी** - वि० चालाक ; చతురుడు; నేర్పరి; జిత్తులమారి.

**ढँढोरा** - पुं० చాటింపు; దండోరా.

**ढँढोरिया** - पुं० చాటించువాడు; దండోరా వేయువాడు.

**ढकना** - स०क्रि० మూతవేయుట; కప్పుట अ०क्रि० దాగుట; మూత.

**ढकेलना** - स०क्रि० నెట్టుట; త్రోయుట.

**ढकोसला** -पुं० బూటకము; ఆడంబరము.

**ढकना** - स०क्रि० మూయుట; మూత పెట్టుట.

**ढक्कन** - पुं० మూత.

**ढकनी** - स्त्री० మూత.

**ढक्का** - स्त्री० రాండోలు.

**ढब** - पुं० ढंग ; పద్ధతి; రీతి; ప్రకారము; యుక్తి; రచన; స్వభావము.

**ढर्रा** - पुं० పనిచేయు విధానము; పద్ధతి; రీతి; అలవాటు.

**ढलना** -अ०क्रि० పల్లమునకు ప్రవహించుట లేక జారుట ( నీరు మొ॥) పతనమగుట.

**ढलाई**-स्त्री० పోతపోయుపని; పోతమజూరి.

**ढहरी** - स्त्री० दे० डेहरी..

**ढहवाना** - स०क्रि० కూలత్రోయించుట.

**ढहाना** - स०क्रि० दे० ढहवाना.

**ढांकना** - स०क्रि० మూయుట; కప్పుట.

**ढाँचा** - पुं० రచనా విధానము; పద్ధతి; తరహా.

**ढाँपना** - स०क्रि० दे० ढाँकना.

**ढाँसना** - पुं० పొడిదగ్గు దగ్గుట.

**ढाँसी** - स्त्री० పొడి (కళ్ళ లేని) దగ్గు.

**ढाक** - पुं० మోదుగచెట్టు; పలాశ వృక్షము; యుద్ధభేరి; **ढाक के तीन पात** - मु० ఎప్పుడూ ఒకే విధముగా.

**ढाड** - स्त्री० ఘీంకారము; గర్జన; పెద్ద అరుపు.

**ढाड मारना** - मु० అరుస్తూ ఏడ్చుట.

**ढाढस** - पुं० ధైర్యము; ఓదార్పు.

**ढाना** - स०क्रि० పడగొట్టుట; కూల ద్రోయుట.

**ढाबर** - वि० మురికిగానున్న; पुं० గుంట.

**ढाबा** - पुं० చిన్న మిద్దె; చూరు; ఒక విధమగు హోటలు.

**ढारना** - स०क्रि० दे० ढालना.

**ढारस** - पुं० दे० ढाढस.

**ढाल** - स्त्री० డాలు; అడ్డు; ఏటవాలు భూమి.

**ढालवाँ ढालुवा ढालू** - वि० ఏటవాలుగా నున్న.

**ढिंढोरना** - स०क्रि० చాటింపువేయుట; తడుముట; వెతుకుట.

**ढिंढोरा** - पुं० చాటింపు.

**ढिंढोरा पीटनपा** - पुं० బాగా ప్రచారము చేయుట.

**ढिढाई** - स्त्री० **गुस्ताखी** ; దూర్తత; అను చితమైన ప్రవర్తన.

**ढिलाई** - स्त्री० శైథిల్యము; సోమరితనము; విలంబనము; వదులు.

**ढीठ** - वि० అమర్యాదగా వ్యవహరించు; ధూర్తుడు.

**ढील** - स्त्री० శైథిల్యము; సడలింపు.

**ढीला** - वि० సడలిన; సోమరి; వదులైన.

**ढीलापन** - पुं० శైథిల్యము; సడలింపు.

**ढूँढ** - स्त्री० అన్వేషణ; వెతుకుడు.

**ढूंढना** - स०क्रि० అన్వేషించుట; వెతుకుట.

**ढूह; ढूहा** - पुं० పెద్దకుప్ప; పెద్ద దిబ్బ.

**ढेर** - पुं० కుప్ప; రాశి.

**ढेरी** - स्त्री० ढेर.

**ढेला** - पुं० మట్టిగడ్డ; కంకరరాయి; కంటి తెల్లగుడ్డు.

**ढोंग** - पुं० **ढकोसला;** ఆడంబరము; బూటకము.

**ढोंगी** - वि० పాషండుడు; ప్రవంచకుడు; బూటకపు మనిషి.

**ढोना** - स०क्रि० మోయుట (బరువు).

**ढोर** - पुं० **चौपाया;** పశువు.

**ढोल** - पुं० డోలు; చెవిలోని పొర.

## त

**तंग** - वि० బిగువైన; ఇరుకైన; ఇబ్బంది కరమైన; గుఱ్ఱపు జీను బిగింపునకు ఉపకరించు తోలుపట్టీ.

**तंडुल** - पुं० బియ్యము.

**तंतु** - पुं० నూలు; దారము; సాలెపురుగు.

**तंदुरूस्त** - वि० ఆరోగ్యముగల; స్వస్థతగల.

**तंदुरुस्ती** - स्त्री० ఆరోగ్యము; స్వస్థత.

**तंद्रा** - स्त्री० నిద్రాజనిత బద్ధకము; నిద్ర జాగరణల మధ్య స్థితి.

**तंबाकु** - पुं० दे० तमाकू.

**तंबीह** - स्त्री० चेतावनी; హెచ్చరిక; తాకీదు.

**तंबू** - पुं० డేరా; గుడారము.

**तंबूरा** - पुं० తంబుర అనబడు ఒక వాద్యము.

**तंबूल ; तंबोल** - पुं० दे० तांबूल.

**तंबोली** - पुं० तमोली ; తమలపాకులు అమ్మువాడు.

**तअज्जुब** - पुं० दे० ताज्जुब.

**तअस्सुब** - पुं० మతపక్షపాతము; జాతి పక్షపాతము.

**तक** - पुं० వరకు.

**तकदीर** - स्त्री० किस्मत ; అదృష్టము; ప్రారబ్ధము.

**तकरार** - स्त्री० వితండవాదము; తగాదా; తంటా.

**तकरीबन** - स्त्री० लगभग ; షుమారు; రమారమి.

**तकेली** - स्त्री० తక్లీ; చిన్నకదురు.

**तकलीफ** - स्त्री० కష్టము; ఇబ్బంది; విపత్తు.

**तकिया** - पुं० దిండు; టిక్కా.

**तखत** - पुं० రాజసింహాసనము; పెద్ద చెక్క బల్ల.

**तखता** - पुं० కొయ్యబల్ల.

**तट** - पुं० ఒడ్డు; అంచు; తీరము.

**तटस्थ** - वि० తటస్థముగా నుండుట; మధ్యస్థముగా నున్న; నిరపేక్షముగా నున్న.

**तडकभडक** - स्त्री० ठाट-बाट ; కోలాహలము; తళుకు-బెళుకు.

**तडका**-स्त्री० ప్రాతఃకాలము; వేకువజాము; వారింపు.

**तडप** - स्त्री० వ్యాకులత; హైరాని; మెరుపు; బాధ.

**तडपना** - अ०क्रि० కలవరపడుట; బాధతో తన్నుకొనుట.

**तडपाना**-स०क्रि० విలవిలతన్నుకొనునట్లు చేయుట.

**तत्काल** - क्रि०वि० తక్షణమే; వెంటనే.

**तत्काली; तत्कालीन** - वि० ఆకాలపు.

**तत्पर** - वि० తయారైన; సన్నద్ధమైన; నైపుణ్యముగల.

**तत्सम** - पुं० మూలభాషలో వాడబడు శబ్దరూపమే ఇతర భాషలో ప్రయుక్తమగు శబ్దరూపము.

**तथा** - अव्य० మరియు; ఇటులనే;

అటులనే.

**तथास्तु** - यौ० अव्य० ऐसा ही हो; అలాగే అగుగాక.

**तथ्य** - पुं० యథార్థము; సారము; సత్యము.

**तदपि** - अव्य० दे० तथापि.

**तदबीर** - स्त्री० ఉపాయములు; యుక్తి; యత్నము.

**तद्भव** - पुं० మూలభాషలో చలామణిఅగు శబ్దరూపము కొంత మార్పుజెంది ఇతర భాషలో వ్యవహృతమగు రూపము.

**तन** - पुं० శరీరము; దేహము; వైపు.

**तनकीह** - स्त्री० అన్వేషణ; సోదా.

**तनखाह; तनख्वाह** - स्त्री० వేతనము; జీతము.

**तनना** - अ०क्रि० బిగిసికొనుట; గీరగా ప్రవర్తించుట; బిరుసుగా నుండుట.

**तनय** - पुं० పుత్రుడు; కుమారుడు.

**तनया** - स्त्री० పుత్రిక; కుమార్తె.

**तनहा** - वि० ఏకాకి; ఒంటరి.

**तना** - पुं० చెట్టు మొదలు.

**तनाव** - पुं० లాగుడు; బిగుతు; త్రాడుపురి; स्त्री० డేరాత్రాడు.

**तनिक** - वि० కొంచెము; కొద్ది; తక్కువ; చిన్న.

**तनुज** - पुं० పుత్రుడు; కుమారుడు.

**तनुजा** - स्त्री० కుమార్తె; కూతురు.

**तप** - पुं० తపస్సు; తాపము; వేడిమి.

**तपना** - अ०क्रि० వేడెక్కుట; కాగుట.

**तपस** - स्त्री० दे० तपस्या.

**तपाक** - पुं० ఉత్సాహము; ఆవేశము; వేగము.

**तपाना** - स०क्रि० వేడిచేయుట; కష్టపెట్టి పరీక్షించుట.

**तपेला** - पुं० తపేళ.

**तब** - अव्य० అప్పుడు; ఆ సమయమున.

**तबल** - पुं० ఢంకా; పెద్ద డోలు.

**तबलची** - पुं० తబలా వాదకుడు.

**तबला** - पुं० ఒకవిధమగు మృదంగము.

**तबादला** - पुं० పరివర్తన; స్థానపరివర్తన.

**तबाह** - वि० నాశమైన; ధ్వంసమైన.

**तबाही** - स्त्री० बरबादी ; సర్వనాశము.

**तब्दील** - वि० మారిన; స్థానాంతరమైన; పరివర్తనము.

**तब्दीली** - स्त्री० పరివర్తనము; మార్పు; స్థానాంతరణము.

**तभी** - अव्य० ఆ సమయముననే; అప్పుడే; ఈ కారణము వల్లనే.

**तमंचा** - पुं० పిస్తోలు.

**तमगा** - पुं० బహుమాన పతకము; మెడలు.

**तमाचा** - पुं० थप्पड ; చెంపకాయ.

**तमाम** - वि० యావత్తు; అంతయు.

**तमाशा** - पुं० అద్భుతమైన దృశ్యము; వినోదము కలిగించు దృశ్యము; తమాషా.

**तमाशाई** - पुं० తమాషా చూచువాడు.

**तमीज** - स्त्री० మర్యాద; జ్ఞానము; బుద్ధి; వివేకము.

**तम्बीह** - स्त्री० चेतावनी; ఉపదేశము; తాకీదు.

**तय** - वि० నిశ్చయింపబడిన; నిర్ణీతమైన; దాటిన.

**तरंगवती** - स्त्री० నది.

**तर** - वि० ఆర్ద్రమగు; తడిసిన; చెమ్మగల; क्रि०वि० క్రింద.

**तरकारी** - स्त्री० शाक; కూరగాయ; కూరాకు; కూరపువ్వు.

**तरकीब** - स्त्री० ఉపాయము; యుక్తి; తీరు.

**तरक्की** - स्त्री० వృద్ధి; ఉన్నతి.

**तरजनी** - स्त्री० दे० तर्जनी.

**तरजुमा** - पुं० అనువాదము; తర్జుమా.

**तरना** - अ०क्रि० దాటుట; ముక్తినొందుట.

**तरफ** - स्त्री० వైపు; దిశ; పార్శ్వము.

**तरफदार** - वि० పక్షపాతి; సమర్థించువాడు.

**तरबूज** - पुं० పుచ్చకాయ.

**तरस** - पुं० జాలి; దయ; జాలిపడుట.

**तरसना** - अ०क्रि० లభించని కారణంగా బాధపడుట; తహతహలాడుట.

**तरसाना**-स०क्रि० ललचाना; ఊరించుట

**तरह** - स्त्री० ప్రకారము; రీతి మాదిరి; స్థితి.

**तरहदार** - वि० షోకిల్లా.

**तराई** - स्त्री० కొండలోయ; కొండక్రింది నిమ్న ప్రదేశము.

**तराजू** - पुं० త్రాసు; తక్కెడ.

**तराना** - पुं० వాడుకలోనున్న ఒక విధమగు పాట; గేయము.

**तरीका** - पुं० విధానము; పద్ధతి; తీరు; ప్రవర్తన.

**तरु** - पुं० చెట్టు; వృక్షము.

**तरुण** - वि० తరుణుడు; జవసత్త్వములు గల; నూతనమైన.

**तरुणी** - स्त्री० యువతి.

**तरैया** - स्त्री० నక్షత్రము.

**तर्कना**-स०क्रि० తర్కించుట; త్యజించుట.

**तर्की** - पुं० తర్కించువాడు.

**तर्ज** - पुं० ప్రకారము; తరహా; శైలి.

**तर्जनी** - स्त्री० చూపుడువేలు.

**तर्जुमा** - पुं० భాషాంతరీకరణము; అనువాదము.

**तर्पण** - पुं० తర్పణము; పూర్వీకులను తృప్తి పరచుటకై చేయు శ్రాద్ధము.

**तल** - पुं० అడుగుభాగము.

**तलना**-स०क्रि० నేతిలోగాని, నూనెలోగాని ఏదేని వేయించుట; వండుట.

**तलवा** - पुं० పాదతలము; అరికాలు.

**तलवार** - स्त्री० ఖడ్గము; కత్తి.

**तलहटी**-स्त्री० तराई ;కొండక్రింది భూమి.

**तलाक**-पुं० వివాహ విచ్ఛేదము; విడాకులు.

**तलाश**-स्त्री० खोज;వెతుకుడు; వెతుకుట.

**तलाशना** - स०क्रि० खोजना; వెతుకుట.

**तलाशी** - स्त्री० సోదా.

**तले** - क्रि०वि० नीचे ; క్రింద.

**तव** - सर्व० నీయొక్క.

**तवा** - पुं० పెనము.

**तसल्ली** - स्त्री० ఓదార్పు; ఆశ్వాసనము; ధైర్యము.

**तसवीर** - स्त्री० दे० सत्वीर.

**तस्वीर** - स्त्री० చిత్రము; ఫొటో.

**तह** - स्त्री० అడుగుభాగము; మడతపెట్టుట.

**तहलका** - पुं० बरबादी ; వినాశము; మత్యువు; కోలాహలము.

**तहस नहस** - वि० बरबाद ; నష్టమైన; ధ్వంసమైన.

**तहसील** - स्त्री० వసూలు; భూమిశిస్తు; కచ్చేరి.

**तहसीलना** - स०क्रि० శిస్తుమొ. వి వసూలు చేయుట.

**ताँता** - पुं० వరుస; పంక్తి.

**ताँबा** - पुं० రాగి.

**ताई** - स्त्री० తండ్రి అన్నగారి భార్య; చిన్న బూర్లెమూకుడు.

**ताक** - स्त्री० స్థిరదృష్టి; అవలోకనము; అదనుకొరకు ఎదురుచూచుట.

**ताक** - पुं० గోడగూడు.

**ताकत** - स्त्री० శక్తి; సామర్థ్యము.

**ताकतवर** - वि० బలమైన; సమర్థవంతమైన.

**ताकना** - स०क्रि० పొంచిచూచుట.

**ताकि**-अव्य०इसलिए कि;ఈ కారణంగా; దేనివల్లనైతే.

**ताज** - पुं० రాజ మకుటము; కిరీటము.

**ताजगी** - स्त्री० నూతన సత్యము; నవీనత.

**ताजा**-वि०వినూత్నమైన; ఆరోగ్యవంతమైన; ఇప్పుడిప్పుడే తయారైన.

**ताजिया** - पुं० పీరుల పండుగ ఉత్సవము.

**ताज्जुब** - पुं० ఆశ్చర్యము; విస్మయము.

**ताटंक** - पुं० కర్ణాభరణము; ఒక విధమగు చెవి నగ.

**ताड** - पुं० తాడిచెట్టు; ఒక విధమైన హిందీ పద్యము.

**ताडना** - स्त्री० ప్రహారము; దండన; బెదరింపు; గ్రహించుట.

**ताडी** - स्त्री० తాటికల్లు; ధ్యానము.

**तात** - पुं० తండ్రి; वि० వేడిగల.
**तादाद** - स्त्री० సంఖ్య; గణన.
**तानना** - स०क्रि० లాగి సాగదీయుట; గురి చూచుట.
**तानपूरा** - पुं० సితారు మాదిరి ఒక వాయిద్యము; తంబుర.
**ताना** - पुं० వ్యంగ్యము; వ్యంగ్యోక్తి; పడుగు నూలు.
**ताना-बाना** - पुं० పడుగు - పేక.
**तानाशाह** - पुं० నిరంకుశ ప్రభువు; నియంత.
**तानाशाही** - स्त्री० నిరంకుశ; స్వేచ్ఛాచారిత.
**ताप** - पुं० गरमी ; తాపము; వేడిమి; జ్వాల; జ్వరము.
**तापना** - स०क्रि० సెగకాచుకొనుట; తపించుట.
**ताबेदार** - वि० ఆజ్ఞాకారి; దాసుడు.
**ताया** - पुं० తండ్రి అన్నయ్య; పెత్తండ్రి.
**तारघर** - पुं० టెలిగ్రాఫ్ ఆఫీసు.
**तारना** - स०क्रि० దాటించుట; తరింప జేయుట.
**तारा** - पुं० నక్షత్రము; కనుపాప; సితార (వాద్యము).
**ताराज** - पुं० దోపిడి; వినాశము.
**तारी** - स्त्री० दे० ताली & दे० ताडी.
**तारीक** - वि० నల్లని; చీకటిగల.
**तारीख** - स्त्री० తేదీ; తిథి.
**तारीफ** - स्त्री० ప్రశంస; పొగడ్త.
**ताल** - पुं० అరచేయి; చెరువు; తప్పెట; తాళము (సంగీతము).
**ताला** - पुं० తాళము.
**तालाब** - पुं० చెరువు; జలాశయము.
**तालिका**-स्त्री०తాళపు చెవి; సూచి (లిస్టు).
**ताली** - स्त्री० తాళపు చెవి; అరచేయి; తాటి కల్లు; కరతల ధ్వని; చప్పట్లు.
**तालु** - पुं० दे० तालू.
**तालूका** - पुं० दे० ताल्लुक.
**तालू** - पुं० కొండనాలుక; అంగిలి.
**ताल्लुक** - पुं० విశాలమైన క్షేత్రము; పల్లుగ్రామములు గల జమీందారి సం బంధము.
**तावीक** - पुं० తాయత్తు.
**ताश** - पुं० ఒక విధమగు విలువైన వస్త్రము; చీట్లపేక
**तिकडम** - पुं० యుక్తి; ట్రిక్కు.
**तिकोना** - वि० త్రికోణము.
**तिक्की** - स्त्री० మూడుచుక్కలు గల పేక ముక్క.
**तीखापन** - पुं० చేదు.
**तिगुना** - वि० మూడురెట్లు గల; మూడింతలు గల.

**तिजारत** - स्त्री० వాణిజ్యము; వ్యాపారము.

**तिजोरी** - स्त्री० ఇనుప పెట్టె.

**तितर बितर** - पुं० అస్తవ్యస్తమైన; చెల్లాచెదురైన.

**तितली** - स्त्री० సీతాకోకచిలుక.

**तिथि** - स्त्री० తిథి.

**तिनकना** - अ०क्रि० కోపగించుట; మండి పడుట.

**तिनका** - पुं० తృణము; గడ్డిపోచ.

**तिपाई** - स्त्री० ముక్కాలు పీట.

**तिपाड** - पुं० మూడు పట్టీలు గలది.

**तिबारा** - वि० तीसरी बार; మూడవసారి.

**तिमजिला** - वि० మూడు అంతస్తులు గల.

**तिमिंगल** - पुं० తిమింగలము; పెద్ద సముద్రపు చేప; తిమింగలమనబడు ఒక ద్వీపము.

**तिय** - स्त्री० స్త్రీ; భార్య.

**तिरछा** - वि० వంకర; కుటిలమైన.

**तिरस्कृत** - वि० తిరస్కరింపబడిన.

**तिल** - पुं० నువ్వులు; పుట్టుమచ్చ.

**तिलक** - पुं० బొట్టు; పట్టాభిషేకము; శ్రేష్ఠవ్యక్తి.

**तिलमिलाना** - अ०क्रि० दे० तिरमिराना.

**तिलस्म** - पुं० గారడీ; ఇంద్రజాలము.

**तिलांजलि; तिलांजली** - स्त्री० తిలాంజలి; శ్రాద్ధము.

**तिहाई** - स्त्री० మూడవ భాగము; పొలము పంట.

**तीखा** - वि० తీక్షణమైన; పదునైన.

**तीज** - स्त्री० తదియ (తిథి).

**तीता** - वि० చేదు; ఘాటైన; కటువైన.

**तीन** - वि० మూడు.

**तीमारदारी** - स्त्री० పరిచర్య; సేవ; శుశ్రూష.

**तीर** - पुं० తీరము; ఒడ్డు; బాణము.

**तीस** - वि० ముప్పది; '30' సంఖ్య.

**तीसरा** - वि० మూడవ.

**तुंग** - वि० ఉన్నతమైన; ఎతైన.

**तुच्छ** - वि० క్షుద్రమైన; పనికిమాలిన.

**तुतराना; तुतलाना** - अ०क्रि० అస్పష్టమైన ధ్వనితో మాట్లాడుట.

**तुनक** - वि० దుర్బలమైన; కోమలమైన.

**तुपक** - स्त्री० తుపాకీ.

**तुमुल** - पुं० సైన్యపు అలజడి; కోలాహలము; భయంకరమైన సంఘర్షణము; वि० భయంకరమైన.

**तुरंग** - पुं० అశ్వము; గుఱ్ఱము;

**तुरंत** - क्रि०वि० వెంటనే; తక్షణమే.

**तुरई** - स्त्री० బీరకాయ.

**तुरकाना** - पुं० తురకలవలె; తురకలదేశము; తురక దేశపు నివాసి.

**तुरंत** - अव्य० శీఘ్రముగా; వెంటనే.
**तुरप** - पुं० చీట్లపేకలో తురుపుముక్క.
**तुर्क** - पुं० తురకమనిషి; టర్కీ దేశపు నివాసి.
**तुलना** - अ०क्रि० తూయబడుట; సమమగుట.
**तुला** - स्त्री० త్రాసు.
**तुल्य** - वि० సమానము; సదృశము.
**तूफान** - पुं० తుఫాను; విపత్తు.
**तूफानी** - वि० జగడాలమారి; దుండగుడు; మిధ్యారోపకుడు; ప్రచండమైన.
**तूमना** - स०क्रि० దూది ఏకుట.
**तूलिका; तूली** - स्त्री० బొమ్మలు వేయుటకు ఉపకరించు కుంచె.
**तृण** - पुं० तिनका; తృణము; గడ్డిపరక.
**तृषा** - स्त्री० దాహము; దప్పిక; లోభము.
**तेज** - पुं० తేజము; దీప్తి; మెరుపు; పరాక్రమము. తాపము.
**तेज** - वि० పదునైన; తీక్ష్ణమైన; తెలివిగల.
**तेजस्वी** - वि० కీర్తిమంతుడు; తేజస్సుగల; ప్రభావశాలి.
**तेजी**-स्त्री० శీఘ్రత; చురుకు; తీవ్రత; గిరాకి.
**तेल** - पुं० తైలము; నూనె.
**तेलुगू** - स्त्री० తెలుగు భాష.
**तेलहन** - पुं० తైలధాన్యములు.
**तेलिन** - स्त्री० నూనె అమ్ము స్త్రీ.
**तेली** - पुं० తెలికల జాతి మనిషి.
**तेहराना** - स०क्रि० మూడు మడతలు పెట్టుట; మూడవసారి చేయుట.
**तैयार** - वि० ఉపయుక్తమైన; సిద్ధమైన; తయారైన.
**तैयारी**-स्त्री० సంసిద్ధత; సన్నద్ధత; తయారి.
**तैरना** - अ०क्रि० ఈదుట; తేలుట.
**तैराई** - स्त्री० ఈత.
**तैराक** - वि० ఈదువాడు; ఈతగాడు.
**तैल** - पुं० తైలము; నూనె.
**तैश**-पुं० ఆవేశము; ఉద్వేగము; క్రోధావేశము.
**तोद** - स्त्री० బొజ్జ; ఉదరము.
**तोडना** - स०क्रि० త్రుంచుట; కోయుట, విరచుట.
**तोतला** - वि० అస్పష్టముగా మాట్లాడువాడు.
**तोता** - पुं० చిలుక.
**तोप** - स्त्री० ఫిరంగి.
**तोबडा** - पुं० గుఱ్ఱము మూతికి తగిలించు సంచి.
**तोरण** - पुं० తోరణము.
**तोलना** - स०क्रि० दे० तौलना.
**तोला** - पुं० తులము.
**तोहफा** - पुं० కానుక; బహూకరణము.
**तौंसा** - पुं० భరించరాని తాపము; జ్వాల.

**तौर** - पुं० నడక; నడత.
**तौर-तरीका** - पुं० ప్రవర్తన; పద్ధతి.
**तौलना** - स०क्रि० తూచుట.
**तौलाई** - स्त्री० తూకము; తూచినందుకు కూలి.
**तौलना; तौलवाना** - स०क्रि० తూయించుట; स०क्रि० తాపము కలుగజేసి వేధించుట.
**त्यागना** - स०क्रि० త్యజించుట; వదిలిపెట్టబడిన.
**त्यागपत्र** - पुं० इस्तीफा ; రాజీనామా.
**त्याज्य** - वि० త్యజింపదగిన, విడువదగిన.
**त्योरी** - स्त्री० చూపు; దృష్టి.
**त्योहार** - पुं० పండుగ; పర్వదినము.
**त्रसना** - अ०क्रि० భయము నొందుట; భయపడుట.
**त्राण** - पुं० రక్షణ; రక్ష.
**त्रास** - पुं० భయము; కష్టము.
**त्रासना** - स०क्रि० భయపెట్టుట.
**त्रिभुज** - पुं० ముక్కోణము.
**त्रिय: त्रिया** - स्त्री० స్త్రీ.
**त्रुटि** - स्त्री० అపూర్ణత; లోటు.
**त्वचा** - स्त्री० చర్మము; తొక్క; తోలు.

## थ

**थकना** - अ०क्रि० అలయుట; బడలుట; అలసిపోవుట.
**थकान** - स्त्री० అలసట; బడలిక.
**थकामाँदा** - वि० అలసిన; బడలిన.
**थकावट** - स्त्री० थकान ; అలసట; శైథిల్యము.
**थन** - पुं० పశువుల పొదుగు లేక చన్ను.
**थपकना**-स०क्रि० చిచ్చికొట్టుట; చిచ్చికొట్టి నిద్రపుచ్చుట (పిల్లలను); ఆప్యాయముగా అరచేతితో తట్టుట.
**थपकी** - स्त्री० చిచ్చి; ఆప్యాయముగా అరచేతితో మెల్లగా తట్టుట.
**थप्पड** - पुं० तमाचा ; చెంపకాయ.
**थमना** - अ०क्रि० रुकना ; ఆగుట.
**थरथराना** - अ०क्रि० ప్రకంపించుట; భయముతో కంపించుట.
**था** - अ०क्रि० కి భూత కాలపు రూపము.
**थाती** - स्त्री० अमानत ; తరువాత తీసికొనుటకు జమ చేసిన సొత్తు.
**थान** - पुं० స్థానము; గుడ్డల తాను.
**थाना** - पुं० పోలీసు ఠాణా.
**थानेदार** - पुं० పోలీసుఠాణా అధికారి.
**थाल** - पुं० పెద్ద పళ్ళెము.
**थाला** - पुं० మొక్కలపాదు; కుదురు.
**थाली** - स्त्री० పళ్ళెము.
**थाहना** - स०क्रि० లోతుతీయుట; జాడ

తీయుట.

**थिरकना** - अं॰क्रि॰ నాట్యము చేయుట.

**थूक** - स्त्री॰ ఉమ్మి.

**थूकना** - अं॰क्रि॰ ఉమ్మివేయుట.

**थूथन** - पुं॰ పశువుల ముట్టె.

**थूनी** - स्त्री॰ స్తంభము; పోటీగుంట.

**थूरना** - सं॰क्रि॰ దంచుట; చూర్ణము చేయుట; చితకబాదుట; కూరికూరి నింపుట.

**थूल ; थूला** - वि॰ స్థూలముగు; లావైన.

**थैला** - पुं॰ పెద్దచేతిసంచి; డబ్బుసంచి.

**थैली** - स्त्री॰ చేతిసంచి.

**थोक** - पुं॰ కుప్ప; పోగు; రాశి; టోకు.

**थोडा** - वि॰ కొద్ది; కొంచెము.

**थोडे-बहुत** - यौ॰ ఎంతోకొంత.

**थोथा** - वि॰ నిస్సారమైన; బోలుగల; పనికిమాలిన.

**थोपना**-सं॰क्रि॰పూయుట; ఆరోపించుట.

## द

**दंग** - वि॰ ఆశ్చర్యచకితుమైన; స్తంభించిన; సంభ్రమము; భయము.

**दंगल** - पुं॰ మల్లులు పోటీ; మల్లయుద్ధము; గోదా; పెద్ద దిండు లేకపల్చని మెత్త.

**दंगा** - पुं॰ కొట్లాట; కోలాహలము.

**दंड** - पुं॰ దండము; కర్రచేతి కర్ర; జర్మానా.

**दंडना** - सं॰क्रि॰ దండించుట.

**दंत** - पुं॰ దంతము; పన్ను.

**दंतकथा** - स्त्री॰ పుకారు; పుక్కిటి పురాణము.

**दंपति, दंपती** - पुं॰ భార్యాభర్తలజోడు.

**दंभी** - वि॰ గర్విష్ఠి; ఆడంబరుడు; ప్రవంచకుడు.

**दई** - पुं॰ భగవానుడు.

**दक्ष** - पुं॰ నైపుణ్యముగల; తెలివైన; సమర్థమైన.

**दखल**-पुं॰ప్రవేశము; అధికారము; జోక్యము.

**दगा** - स्त्री॰ మోసము; దగా.

**दगाबाज** - वि॰ దగాకోరు.

**दगाबाजी** - स्त्री॰ మోసము; ప్రవంచన.

**दत्तक** - पुं॰ దత్తపుత్రుడు; దత్తు ఇవ్వబడిన వాడు.

**दत्तचित** - वि॰ నిమగ్నమైన; ధ్యాన నిమగ్నమైన; మనస్సులగ్నమైనన.

**दधि** - पुं॰ పెరుగు; సముద్రము.

**दफतर** - पुं॰ दे॰ दफ्तर.

**दफती** - स्त्री॰ మందపాటి అట్ట.

**दफन** - पुं॰ భూమియందు పూడ్చుట (శవము).

**दफनाना** - सं॰क्रि॰ భూమిలో (శవము) పూడ్చుట; పాతివేయుట.

**दफा** - स्त्री० बार ; తడవ: చట్టమునందలి నియమము తొలగింపబడిన; తిరస్కరింపబడిన.

**दफ्तर** - पुं० కార్యాలయము.

**दफ्तरी**-पुं० కార్యాలయములోని ఒకనౌకరు; పుస్తకములకు బైండు చేయువాడు.

**दफ्ती** - स्त्री० दे० दफती.

**दबंग** - वि० ప్రభావశాలి; పలుకుబడి గల; ప్రతాపముగల.

**दबदबा**-पुं०తేజస్వి; పలుకుబడి; ప్రతాపము.

**दबना** - अ०क्रि० అణగుట; అణగారుట; అదుపులోకి వచ్చుట; పలుకుబడికి లోనగుట.

**दबाना** - स०क्रि० అణచుట; అణగార్చుట; నొక్కుట.

**दबाव** - पुं० ఒత్తిడి; బలాత్కారము; అణిచివేత.

**दबैल** - वि० ఒత్తిడికి లోనైన; ఒత్తిళ్ళకు లోనగువాడు.

**दबोचना** - स०क्रि० తటాలున పైబడి అణచివేయుట; పట్టుకొని నలిచివేయుట; దాచుట.

**दम** - पुं० శ్వాస.

**दमक** - स्त्री० తళుకు.

**दमडी** - स्त्री० దమ్మిడి.

**दमदार** - वि० దృఢమైన; బలిష్టమైన; సమర్థమైన.

**दमनशील** - वि० అణచువాడు; అణచు స్వభావము గల.

**दमा** - पुं० ఉబ్బసపు వ్యాధి.

**दमामा** - पुं० ఢంకా; నగారా.

**दया** - स्त्री० దయ; కృప.

**दर** - पुं० ద్వారము; దర్వాజ; గుహ; భయము; ధర.

**दरकार** - स्त्री० जरुरत ; ఆవశ్యకత.

**दरकारी** - वि० जरुरी ; ఆవశ్యకమైన.

**दरख्त** - पुं० చెట్టు.

**दरखवास्त** - स्त्री० ప్రార్థనాపత్రము.

**दरद** - पुं० బాధ; నొప్పి; ఒక ప్రాచీనజాతి లేక భాష.

**दरदर** - क्रि०वि० ద్వారద్వారము; ఇంటి ఇంటికి.

**दरबान** - पुं० ద్వారపాలకుడు.

**दरबार** - पुं० రాజసభ; దర్బారు; ఆస్థానం.

**दरवाजा** - पुं० ద్వారము; కవాటము.

**दरा** - पुं० दे० दर्रा.

**दरार** - स्त्री० బీటు; పగులు.

**सरारना**-अ०क्रि० బీటువారుట; పగులుట.

**दरिया** - पुं० నది; సముద్రము.

**दरियाफ्त करना** - स०क्रि० విచారించుట;

జాడతీయుట.

**दर्ज** - स्त्री० दे० दरज - वि० వ్రాసిన; ఎక్కిం చిన (పుస్తకములో).

**दर्जन** - पुं० డజను.

**दर्जा** - पुं० తరగతి; హోదా; పదవి.

**दर्जी** - पुं० దుస్తులు కుట్టి తయారుచేయు వాడు.

**दर्द** - पुं० బాధ; నొప్పి; దుఃఖము.

**दर्दनाक** - वि० దుఃఖాదాయ; కష్టకరమైన; దయనీయమైన.

**दर्दमंद** - पुं० దయగలవాడు; జాలిపడువాడు.

**दल** - पुं० దళము; ఆకు; సమూహము; సైన్యము.

**दलदल** - स्त्री० कीचड ; బురద; ఊబి.

**दलदला** - वि० ఊబిగల.

**दलना** - स०क्रि० పిండి పిండి చేయుట; కాలరాచివేయుట; నువ్వులు తిరగలిలో పోసి విసరుట; ధ్వంసము చేయుట.

**दलमलना** - स०क्रि० నులిమివేయుట; రాచివేయుట; కాళ్ళతో మర్దించి రాచి వేయుట.

**दलाल** - पुं० దళారి.

**दलाली** - स्त्री० దళారిచేయుపని; దళారికి లభించు కమీషను.

**दलित** - वि० అణగారిన; దళితుడు.

**दव** - पुं० దావాగ్ని.

**दवा** - स्त्री० ఔషధము; మందు.

**दवाखाना** - पुं० మందులకొట్టు.

**दवात** - स्त्री० సిరాబుడ్డి.

**दवादारू** - स्त्री० చికిత్స; ఉపచారము.

**दवारी** - स्त्री० दे० दवानल.

**दशा** - स्त्री० స్థితి; ప్రకారము.

**दस्तखत** - पुं० చేవ్రాలు; సంతకము.

**दस्तावेज** - स्त्री० దస్తావేజు.

**दहलीज** - स्त्री० देहली ; గడప.

**दहशत** - स्त्री० భయము.

**दहाई** - स्त्री० పదులస్థానము.

**दहाड** - स्त्री० సింహము మొ. వాటిగర్జనము.

**दहाडना** - अ०क्रि० గర్జించుట; బొబ్బ రింతులు పెట్టి ఏడ్చుట.

**दहिना** - वि० కుడి; అపసవ్యము.

**दहिने** - क्रि०वि० కుడివైపునకు.

**दहिने होना** - यौ० అనుకూలించుట.

**दही** - पुं० పెరుగు; దధి.

**दहेज** - पुं० వరకట్నము.

**दाँत** - पुं० పన్ను; పల్లు.

**दापत्य** - वि० భార్యాభర్తలకు సంబంధిం చిన; దాంపత్యము.

**दाई** - स्त्री० దాది; ఇతరుల పిల్లలకు తన స్తన్యము నిచ్చి పెంచు స్త్రీ; మంత్రసాని.

**दाएँ** - क्रिं०वि० కుడివైపునకు;

**दाख** - स्त्री० ద్రాక్ష; ఎండుద్రాక్ష.

**दाखिल** - वि० ప్రవిష్టమైన; ప్రవేశించిన.

**दाग**-पुं० వాత; కాల్పు; దహనము (శవము).

**दागना** - स०क्रि० కాల్చుట; వాతపెట్టుట.

**दाढी** - स्त्री० గడ్డము.

**दाढीजार**-पुं० స్త్రీలు కోపము వచ్చినప్పుడు పురుషులను తిట్టు తిట్టు.

**दाती** - स्त्री० దాతృత్వము గల స్త్రీ; దాన శీలిని.

**दातुन; दातौन** - पुं० పల్లుతోము పుల్ల; ముఖంపుల్ల.

**दाद** - पुं० తామర అనబడు ఒక చర్మరోగము; న్యాయము; ప్రోత్సాహము; ప్రశంస.

**दादा** - पुं० పితామహుడు, తండ్రి తండ్రి; తాత.

**दादी** - स्त्री० పితామహి; నాయనమ్మ, తండ్రి తల్లి; पुं०న్యాయముకొరకు ప్రార్థించు వాడు; దావా వేయువాడు.

**दानव** - पुं० దానవుడు; రాక్షసుడు.

**दाना** - पुं० బీజము; గింజ; పూస, జ్ఞాని; బుద్ధిమంతుడు.

**दानाई** - स्त्री० తెలివి; బుద్ధికుశలత.

**दामनगीर** - पुं० కొంగు; కొండల క్రింద భూమి.

**दामनगीर** - पुं० కొంగు పట్టుకొని వెంట నుండువాడు; వెంటబడువాడు; దావా చేయువాడు.

**दामाद** - पुं० కుమార్తె భర్త; అల్లుడు.

**दामिनी** - स्त्री० మెరుపు.

**दायाद** - वि० దాయాది; వారసుడు; వాటా దారుడు.

**दारचीनी** - स्त्री० దాల్చినచెక్క; దాసించెక్క.

**दारीजार** - पुं० దాసి భర్త (తిట్టు) దాసీ పుత్రుడు; బానిస.

**दारोगा** - पुं० ఏర్పాటు; వ్యవస్థ తనిఖీ చేయు అధికారి - ఇన్స్పెక్టరు.

**दार्शनिक** - वि० తత్త్వజ్ఞాని; తత్త్వశాస్త్రమునకు సంబంధించిన.

**दाल** - स्त्री० పప్పు; ప్రయోజనము సిద్ధించుట.

**दाल-रोटी** - पुं० సామాన్యపు భోజనము.

**दावत** - स्त्री० విందు.

**दावा** - स्त्री० దావానలము; హక్కు; వ్యాజ్యము.

**दावात** - स्त्री० दे० दवात.

**दाह** - पुं० తాపము; దహనము; ఈర్ష్య.

**दाहना** - स०क्रि० మంటపెట్టుట; భస్మీపటలము చేయుట.

**दाहिना** - वि० కుడి.

**दाहिने** - क्रिं०वि० కుడివైపున.

**दिक** - स्त्री० దిశ; వైపు; దిక్కు.

**दिक** - वि० వేధింపబడిన; కలతజెందిన; ఇరకాటములో పడిన.

**दिक करना**-सं०क्रि०వేధించుట; తంటాలు పెట్టుట.

**दिक्कत** - स्त्री० కష్టము; బాధ; వ్యాకులత; కాఠిన్యము.

**दिखना** - अ०क्रि० కనిపించుట.

**दिखलाना**-सं०क्रि० చూపించుట; చూచుటకు ప్రేరేపించుట.

**दिखाऊ** - वि० చూపించుటకు మాత్రము; చూపింపదగిన; ప్రదర్శింపదగిన; కృత్రిమమైన.

**दिखाना** - सं०क्रि० చూపించుట.

**दिखावट** - स्त्री० ఆడంబరము; పైపూత; కృత్రిమత.

**दिठौना**-पुं० పసిపిల్లలకు పెట్టు దిష్టిబొట్టు.

**दिमाग** - पुं० మస్తిష్కము; మెదడు.

**दिया** - पुं० దీపము.

**दियासलाई** - स्त्री० నిప్పుపుల్ల; అగ్గిపుల్ల.

**दिल** - पुं० మనస్సు; హృదయము.

**दिल-चस्पी** - स्त्री० మనోహరిత; మనోరంజనము.

**दिल-दार** - वि० ఉదారుడు; రసికుడు; ప్రియుడు.

**दिलाना** - सं०क्रि० ఇప్పించుట.

**दिलासा** - पुं० అశ్వాసనము; ఓదార్పు; ధైర్యము.

**दिली** - वि० మనస్ఫూర్తిగా; హృదయపూర్వకమైన.

**दिलेर** - वि० వీరుడు; శూరుడు.

**दिल्लगी** - स्त्री० పరిహాసము.

**दिव** - पुं० స్వర్గము; దినము; ఆకాశము.

**दिवस** - पुं० దినము.

**दिवांध** - वि० పగటిగుడ్డిగుడ్లగూబ.

**दिवा** - पुं० దినము.

**दिवाकर** - पुं० సూర్యుడు.

**दिवालिया** - वि०-पुं० దివాళా తీసినవాడు.

**दिव्य** - वि० దివ్యమైన; స్వర్గమునకు సంబంధించిన; అపూర్వమైన.

**दिव्यचक्षु** - पुं० జ్ఞానచక్షు; ప్రజ్ఞాచక్షు; కళ్ళజోడు.

**दिशा** - स्त्री० దిశ; వైపు; దిక్కు.

**दिहंदा** - वि० ఇచ్చువాడు; దాత.

**दिहाडा** - पुं० దినము; దివసము; పగలు; దుస్థితి.

**दीखना** - अ०क्रि० దృష్టిగోచరమగుట; కనిపించుట.

**दीठ** - स्त्री० దృష్టి;

**दीदी** - स्त्री० అక్క.

**दीन** - वि० దయనీయమైన; మతము.

**दीमक** - स्त्री० చెద; చెదలు.

**दीया** - पुं० దీపము; दीया ठंडा करना.

**दीवान** - पुं० రాజదర్బారు; మంత్రి, కవిత్వ సంకలనము.

**दीवानगी** - स्त्री० పిచ్చి.

**दीवाना** - वि० పిచ్చివాడు; ఉన్మత్తుడు.

**दीवानी** - स्त्री० దివానుపదవి; ఆస్తిపాస్తుల గురించి విచారించు కోర్టు. वि० పిచ్చిది.

**दुआ**-स्त्री० ప్రార్థన; దరఖాస్తు; ఆశీర్వాదము.

**दुकान** - स्त्री० దుకాణము.

**दुकानदार** - पुं० దుకాణములో సరుకులు అమ్మువాడు.

**दुकानदारी** - स्त्री० దుకాణము నడుపుట.

**इक्का दुक्का** - यौ० ఒకళ్ళిద్దరు.

**दुक्की** - स्त्री० పేకముక్కలలో రెండు చుక్కల బంతి.

**दुखडा** - पुं० దుఃఖవృత్తాంతము; ఇక్కట్టు.

**दुखना**-अ०क्रि० బాధపడుట; దుఃఖించుట.

**दुगुना** - वि० రెట్టింపు.

**दुत** - अव्य० తిరస్కార సూచక శబ్దము.

**दुतकारना** - स०क्रि० చీదరించుట.

**दुतर्फा**-वि० రెండువైపులకు సంబంధించిన.

**दुदलाना** - स०क्रि० दे० दुतकारना.

**दुदिला**-वि० సందిగ్ధములో నున్న; వ్యగ్రమైన.

**दुधार** - वि० పాలు ఇచ్చి (ఆవు, గేదె మొ.)

**दुधारा** - वि० (स्त्री०) రెండువైపుల పదును గల; రెండు వైపుల పదుచుండు ఒక విధమగు ఖడ్గము - పట్టా.

**दुधारी**-वि० (स्त्री०) పాలు ఇచ్చునది (ఆవు; గేదె); రెండువైపుల పదునుగల (కత్తి).

**दुधिया** - वि० పాలు కలిసిన; పాలు వలె తెల్లని.

**दुनिया** - स्त्री० ప్రపంచము.

**दुनियाई ; दुनियावी** - वि० ప్రాపంచకపు.

**दुनियादार** - पुं० గృహస్థుడు; ప్రాపంచకపు మనిషి.

**दुनियादारी** - स्त्री० లోకానుభవము; లోక వ్యవహారము.

**दुपहर** - स्त्री० **दुपहरिया; दुपहरी** - स्त्री० మధ్యాహ్నకాలము.

**दुफसली** - वि० రెండు పంటల

**दुबला** - वि० పల్చని; సన్నని; దుర్బలమైన.

**दुबारा** - क्रि०वि० दे० दो बारा.

**दुबिध, दुबिधा** - स्त्री० సందిగ్ధము; సంశయము; గుంజులాట.

**दुभाषिया** - पुं० ద్విభాషి; వార్తాలాపమును అనువదించి భిన్నభాషీయులకు చెప్పు

వాడు.

**दुमंजिला** - वि० రెండు అంతస్తులు గల.

**दुम** - स्त्री० తోక.

**दुरंगा** - वि० తప్పుడు నడతగల.

**दुर दुर करना; दुरदुराना** -मु० ఛీఛీ అనివెడలు గొట్టుట.

**दुराचार** - पुं० చెడు ఆచరణ; దురాచారము.

**दुराना** - स०क्रि० छिपाना; దాచుట; దూరమగుట.

**दुरस्त** - वि० నిర్దోషమైన; స్పష్టతగల; మంచి స్థితిలో నున్న.

**दुर्वचन**-पुं० దుర్వాక్యము; తిట్టు; దూషణ.

**दुर्विपाक**-पुं० దుర్ఘటన; చెడు పరిణామము.

**दुलडी** - स्त्री० రెండు పేటల హారము.

**दुलत्ती** - स्त्री० రెండు కాళ్ళతన్ను (గాడిద, గుఱ్ఱము).

**दुलराना** - स०क्रि० బుజ్జగించుట; మురిపించుట; ముద్దుబిడ్డమాదిరిగా వ్యవహరించుట.

**दुलहन** - स्त्री० కొత్తగా పెళ్ళి అయిన వధువు.

**दुलहा** - पुं० दे० दूल्हा.

**दुलार** - पुं० లాలన; మురిపెము.

**दुलारना** - स०क्रि० లాలించుట; మురిపించుట.

**दुलारा** -वि० లాలింపబడు; మురిపింపబడు బిడ్డడు.

**दुलारी** - वि० ప్రేమాస్పదిని; మురిపెముల బాలిక

**दुशाला** - पुं० ఉన్నిశాలువ.

**दुश्मन** - पुं० వైరి; శత్రువు.

**दुश्मनी** - स्त्री० శత్రుత్వము; వైరము.

**दुस्तर** - वि० దాటుట కష్టసాధ్యమైనది; వికటమైన.

**दुहना** - स०क्रि० పితుకుట (పాలు).

**दुहिता** - स्त्री० కూతురు; బాలిక.

**दूज** - स्त्री० విదియ.

**दूध** - पुं० పాలు; క్షీరము.

**दुधमुख** - वि० दे० दूध मुँहा.

**दून** - वि० రెట్టింపు; కలతజెందిన; రెట్టింపు ధర; కొండలోయ; కొండచరియ.

**दूना** - वि० రెట్టింపు.

**दूब** - स्त्री० గరికగడ్డి దుబ్బు.

**दूर** - क्रि०वि० దూరమున; वि० దూరమున నున్న.

**दूरता** - स्त्री० దూరత్వము; దూరము.

**दूरबीन** - स्त्री० దూరముననున్న వస్తువులను కాన్పింపజేయు యంత్రము దుర్భిణి.

**दूरी** - स्त्री० దూరత్వము; దూరము.

**दूर्वा** - स्त्री० గరికగడ్డి.

**दूलह;दूल्हा**-पुं०వరుడు; పెళ్ళికుమారుడు.

**दूषित** - वि० దోషము గల.

**दूसना** - स०क्रि० दूषना; దూషించుట; నిందించుట.

**दूसरा** - वि० రెండవ; అపరము.

**दृगंचल** - पुं० पलक ; కనురెప్ప.

**दृगोचर** - वि० కంటికి కనిపించు.

**दृश्य** - वि० దృగ్గోచరమైన; దృశ్యము; చూడదగిన.

**देखना** - स०क्रि० చూచుట.

**देखभाल** - स्त्री० నిరీక్షణ; తనిఖీ; అజామాయిషీ.

**देख-रेख** - स्त्री० दे० देख - भाल.

**देग** - पुं० దాక (పాత్ర).

**देगचा** - पुं० చిన్న దాక.

**देगची** - स्त्री० ఇంకా చిన్న దాక.

**देना** - स०क्रि० ఇచ్చుట; पुं०అప్పు.

**देय** - वि० ఇవ్వవలసిన; ఇవ్వదగిన.

**देर ; देरी** - स्त्री० సమయము; విలంబము; జాగు; ఆలస్యము.

**देवर** - पुं० భర్త తమ్ముడు; మరిది.

**देवरा** - पुं० చిన్నదేవుడు.

**देवरानी** - स्त्री० భర్త తమ్ముని భార్య; తోటి కోడలు.

**देशज** - वि० దేశీయము.

**देशनिकला** - पुं० దేశబహిష్కార శిక్ష.

**देसी** - वि० दे० देशी.

**देह** - स्त्री० శరీరము; దేహము ; గ్రామము.

**देहकान** -पुं० గ్రామీణుడు; పల్లెటూరివాడు.

**देहांत** - पुं० మృత్యువు; దేహాంతము.

**देहात** - पुं० గ్రామము; పల్లెటూరు.

**देहाती** - वि० గ్రామీణత; గ్రామమునకు సంబంధించిన.

**दैनिकी** - स्त्री० दे० दैनदिनी.

**दैन्य** - पुं० దీనత; దైన్యము.

**दोगला** - पुं० వర్ణసంకరుడు; జారజుడు.

**दोजख** - पुं० నరకము.

**दोना** - पुं० దొన్నె.

**दोनों** - वि० ఉభయులు; ఇద్దరూ; రెండూ.

**दोफसली** -वि० రెండు పంటలు గల; రెండు పంటలకు సంబంధించిన; రెండు వైపుల పనికి వచ్చు; రెండువైపుల ఉపయోగుడు.

**दोबारा** - क्रि०वि० दुबारा ; రెండవ పర్యాయము.

**दोमजिला** - वि० दे० दोतल्ला.

**दोशंबा** - पुं० సోమవారము.

**दोसाला**-वि० రెండు సంవత్సరముల;రెండు సంవత్సరము వయస్సు గల.

**दोसूती** - स्त्री० दे० दूसूती.

**दोस्त** - पुं० స్నేహితుడు.

**दोस्ताना** - पुं० మైత్రి; స్నేహము; స్నేహ

పూరిత వ్యవహారము; స్నేహ పూరిత మైన.

**दोस्ती** - स्त्री० స్నేహము; మైత్రి.

**दोहनी** - स्त्री० పాలుపితుకు పాత్ర.

**दोहराना** - स०क्रि० दुहराना ; పునరుక్తి చేయుట; రెండు మడతలు వేయుట.

**दौड** - स्त्री० పరుగు.

**दौडना** - अ०क्रि० పరిగెత్తుట.

**दौडान** - स्त्री० ఆగకుండా శ్రమించుట; హడావిడి.

**दौडान** - स्त्री० పరుగు.

**दौरा**-पुं० భ్రమణము; తనిఖీకొరకు అధికారి యాత్రచేయుట; ఉద్యోగసంబంధమైన క్యాంపు.

**दौलत** - स्त्री० ధనము; సంపత్తి.

**दौलतमंद**-वि० సంపన్నుడు; ధనవంతుడు.

**दौलतखाना** - पुं० నివాసస్థానవము (ఆదరార్థము).

**द्विजन्मा** - वि० రెండు పర్యాయములు జన్మించిన; ద్విజుడు; బ్రాహ్మణుడు; పక్షి.

**द्विजिह्व**-वि० ఖలుడు; దుష్టుడు; ఇచ్చక ములాడువాడు; पुं० సర్పము.

**द्विधा** - क्रि०वि० రెండు విధములుగా.

**द्वै** - वि० రెండు; రెండూ.

## ध

**धंधा** - पुं० వృత్తి; పనిపాటు.

**धँसना**-अ०क्रि० చొచ్చుట; కూరుకు పోవుట.

**धँसान** - स्त्री० दलदल ; ఊబి.

**धँसाना** - स०क्रि० చొప్పించుట; దిగ జార్చుట.

**धकधखाना** - अ०क्रि० భయములేక ఆవేశము వలన హృదయము దడదడ కొట్టుకొనుట.

**धकधकी** - स्त्री० హృదయము దడదడ లాడుట.

**धकपकाना** - अ०क्रि० గుండె అదురుట; భయపడుట.

**धक्कमधक्का** - पुं० తొక్కిసలాట.

**धक्का** - पुं० త్రోపుడుదెబ్బ; శోకాఘాతము.

**धक्कामुक्की** - पुं० కొట్లాట; గుద్దులాట.

**धज** - पुं० అలంకరణ.

**धजा** - स्त्री० ధ్వజము; జండా.

**धज्जी** - स्त्री० కత్తిరించిన కాగితపు లేక గుడ్డ పీలిక

**धड** - पुं० శిరస్సులేని శరీరపు మధ్య భాగము; చెట్టు మొదలు.

**धडकन** - स्त्री० గుండెదడ.

**धडकना** - अ०क्रि० గుండెకొట్టుకొనుట.

**धडा** - पुं० తూకము.

**धड करना** - मु० తక్కెడ దాళాను సరిచేయుట.

**धत्** - अव्य० చీత్కారము; చీదరించు శబ్దము.

**धता** - वि० తొలగిన; తొలగించిన; తొలగి ఉన్న.

**धधक** - स्त्री० అగ్నిజ్వాల.

**धधकना** - अ०क्रि० ప్రజ్వలించుట.

**धनिया** - पुं० కొత్తిమీర; ధనియాలు; स्त्री०యువతి.

**धनी** - वि० ధనవంతుడు; అధిపతి; భర్త; యౌవ్వనవతి.

**धनु** - पुं० दे० **धनुस**; ధనస్సు; విల్లు.

**धन्नासेठ** - पुं० గొప్పధనాఢ్యుడు.

**धन्वा** - पुं० ధనస్సు; ఎడారి.

**धन्वी** - वि० ధనుర్ధరుడు; బాణవిద్యలో ఆరితేరినవాడు.

**धपना** - अ०क्रि० పరిగెత్తుట; దుముకుట; కొట్టుట.

**धप्पा** - पुं० చెంపకాయ; చెంపదెబ్బ; నష్టము.

**धब्बा** - पुं० కళంకము; దోషము; మచ్చ.

**धमकना** - अ०क्रि० అకస్మాత్తుగా వచ్చి పడుట.

**धमकी** - स्त्री० బెదరింపు.

**धम गजर** - पुं० ఉపద్రవము; కల్లోలము.

**धमनी** - स्त्री० రక్తనాళము.

**धमाका** - पुं० दे० **धमक**.

**धरकना** - अ०क्रि० दे० **धडकना**.

**धरता** - पुं० ఋణగ్రస్తుడు.

**धरोहर** - स्त्री० **थाती**; అడిగినపుడు ఇచ్చుటకు ఉంచుకున్న ఇతరుల వస్తువు లేక ధనము.

**धसकना** - अ०क्रि० కూరుకుపోవుట; దిగబడిపోవుట; ఈర్ష్యపడుట.

**धसान** - स्त्री० दे० **धँसान**.

**धाँधली** - स्त्री० స్వేచ్ఛాచరిత; ఇష్టారాజ్యము; యధేచ్ఛ; అల్లరివాడు; పోకిరివాడు.

**धाक**-स्त्री० ప్రతాపము; ప్రసిద్ధి; పలుకుబడి.

**धागा** - पुं० దారము; సూత్రము.

**धान** - पुं० ధాన్యములు; వడ్లు.

**धाना** - अ०क्रि० **दौडना**; పరిగెత్తుట.

**धानी**-स्त्री० లేత ఆకుపచ్చరంగు; ధరించునది; చోటు.

**धाय** - स्त्री० దాది.

**धारणा** - स्त्री० బుద్ధి; గ్రహించుశక్తి; దృఢమైన అభిప్రాయము లేక నిశ్చయము.

**धारना** - स०क्रि० ధరించుట; అప్పుతీసుకొనుట.

**धारीदार**-वि० పొడుగైన గీతలు, పట్టీలు గల.

**धावक** - पुं० వార్తాహరుడు.

**धिक** - अव्य० తిరస్కార సూచకశబ్దము; చీదరింపు.

**धिक्कार** - स्त्री० తిరస్కారము; చీదరింపు; ధిక్కారము.

**धीमा** - वि० మందగమనముగల; మెల్లని.

**धीर** - वि० ధైర్యముగల; ఓర్పుగల; గంభీరమైన; ధైర్యము; ఓర్పు.

**धीरज** - पुं० दे० धैर्य.

**धीरे** - क्रि०वि० నెమ్మదిగా; మందగతితో; మెదలకుండా.

**धुंधला** - वि० అస్పష్టముగానున్న; మసగానున్న.

**धुआँ** - पुं० ధూమము; పొగ.

**धुआँयँध** - वि० పొగచూరిన.

**धुन** - स्त्री० సంకల్పము; నిష్ఠ.

**धुनकी** - स्त्री० దూదేకువిల్లు.

**धुनना** - स०क्रि० దూది ఏకుట; చితకబాదుట; మాటిమాటికి చెబుతూ పోవుట; నిరంతరము ఏదో పనిచేస్తూ ఉండుట.

**धुनियाँ** - पुं० దూదేకువాడు.

**धुनी** - वि० పనిలో మనస్సును లగ్నము చేయువాడు; स्त्री० నది.

**धुरियाना** - स०क्रि० దోషమును చాకచక్యముగా కప్పిపుచ్చుట.

**धुरी** - स्त्री० బండి ఇరుసు.

**धुलना** - अ०क्रि० ప్రక్షాళింపబడుట; కడగబడుట.

**धुलाई** - स्त्री० శుభ్రపరచుపని; ఉతుకుడు; ఉతుకుకూలి.

**धुस्सा** - पुं० ఉన్నికంబళి.

**धूत** - वि० ధూర్తుడు; దగాకోరు.

**धूप** - स्त्री० ఎండ; తాపము पुं० ధూపము; సుగంధ ద్రవ్యముల ధూపము.

**धूप-छाँह** - स्त्री० కలనేత చీరలేక వస్త్రము.

**धूमधाम** - स्त्री० గందరగోళము; ఆడంబరము; కల్లోలము.

**धूमल; धूमला; धूमिल** - वि० పొగబారిన; అస్పష్టమైన.

**धूर धानी** - स्त्री० ధూళిరాశి.

**धूर्त** - वि० ధూర్తుడు; ఖలుడు.

**धूवाँ** - पुं० दे० धुआँ.

**धोकड** - वि० బలిష్ఠమైన.

**धोका; धोखा** - पुं० మోసము; దగా; వంచన.

**धोखा खाना** - मु० మోసపోవుట.

**धोखा देना** - मु० మోసగించుట.

**धोखेबाज** - वि० మోసగాడు; దగాకోరు; కుటిలి.

**धोखेबाजी** - स्त्री० మోసము; కపటము.
**धोती** - स्त्री० ధోవతి.
**धोना** - स०क्रि० నీటితో కడిగి శుభ్రపరచుట; ఉతుకుట.
**धोबिन** - स्त्री० చాకలిది; చాకలివాడు.
**धोवती** - स्त्री० दे० धोती.
**धौंकना** - स०क्रि० నిప్పు ప్రజ్వలింప జేయుట; గొట్టముతో ఊదుటలేక బరువువేయుట; శిక్షవేయుట; తిత్తితో విసరుట.
**धौंस** - स्त्री० బెదరింపు; మందలింపు; అధికారము; మోసము.
**धौंसना** - स०क्रि० బెదరించుట; మందలించుట; అధికారము చలాయించుట; కొట్టుట.
**धौला** - वि० తెల్లని.
**ध्यान** - पुं० ధ్యానము.
**ध्रुव** - वि० ధ్రువమైన; స్థిరమైన; ధ్రువ నక్షత్రము.

## न

**नंगा** - वि० నగ్నమైన; దిగంబరమైన.
**नंगा-धडग** - वि० नंगा ; పూర్తిగా దిసెమొలయిన; సిగ్గులేని.
**नंद** - पुं० పుత్రుడు; బాలుడు; హర్షము.
**नंदिनी** - स्त्री० ఆనందము కలుగజేయు కుమార్తె; కూతరు; ఆడపడచు లేక ఆడబిడ్డ
**नंदोई** - पुं० ఆడబిడ్డ భర్త.
**नंबरी** - वि० నంబరుగల; అపకీర్తి పొందిన.
**न** - अव्य० నిషేధవాచకశబ్దము; లేదు; కాదు.
**नईम** - स्त्री० స్వర్గము; అలభ్యవస్తువు.
**नईम** - स्त्री० కానుకగా ఇచ్చిన వస్తువు; మురిపము.
**नकटा** - वि० ముక్కు తెగినవాడు; అప్రతిష్ఠ పాలైనవాడు.
**नकद** - पुं० నగదు; సిద్ధముగానున్న; పనికి సిద్ధముగానున్న.
**नकद-जान** - स्त्री० ఆత్మ.
**नकद-दम** - क्रि०वि० ఒంటరిగా.
**नकद-माल** - पुं० శ్రేష్ఠమైన సరుకు.
**नकदी** - वि० సిద్ధముగానున్న; వెంటనే పనికి ఉపకరించు.
**नकल** - स्त्री० ప్రతిలిపి; నకలు.
**नकीज** - वि० పడగొట్టువాడు; स्त्री० అస్తిత్వ వినాశము; వైరము.
**नक्का** - पुं० సూదిబెజ్జము.
**नक्काल** - पुं० నకలు చేయువాడు; విదూషకుడు.
**नक्कू** - वि० పెద్దముక్కు గలవాడు; తన్ను తను మరచి గొప్పగా భావించేవేరుగా ప్రవర్తిం

చువాడు; పరిహాసము పాలు అగువాడు.

**नक्शा** - पुं० పటము; ప్రకృతి; ఆకారము; చట్టము.

**नख** - पुं० గోరు.

**नखरा** - पुं० ఒయ్యారము; చాంచల్యము; తుంటరి తనము; హావభావము.

**नखरीला** - वि० హావభావములు గల; ఒయ్యారపు నడత గల.

**नखलिस्तान** - पुं० ఎడారిలోని పచ్చని ప్రదేశము; జలాశయము; ఎడారిలోని ఖర్జూరవనము.

**नखियाना** - स०क्रि० గిల్లుట; గీరుట; రక్కుట.

**नग**-पुं० పర్వతము; వృక్షము; రత్నము; నగ.

**नगपति** - पुं० హిమాలయ పర్వతము; చంద్రుడు; శివుడు.

**नगद** - पुं० दे० नकद.

**नगाडा ; नगरा** - पुं० నగారా.

**नजदीक** - वि० సమీపమున; దగ్గరగ.

**नजर** - स्त्री० దృష్టి; చూపు; కటాక్షము; కానుక; లంచము ఇచ్చుట.

**नजरबंद** - पुं० పహరాలోనుండు; గారడీ; కనికట్టు.

**नजराना** - पुं० కానుక; ఉపహారము; దిష్టి తీయుట; బహూకరించుట.

**नजाकत** - स्त्री० సౌకుమార్యము; నాజూకు తనము.

**नट** - पुं० నటుడు.

**नटखट** - वि० కొంటె; పోకిరి; నేర్పరి.

**नटना** - स०क्रि० నటించుట; అభినయించుట; తిరస్కరించుట.

**नतिनी** - स्त्री० नातिन; దౌహిత్రి; కూతురు కూతురు; మనుమరాలు.

**नतीजा** - पुं० పరిణామము; పర్యవసానము.

**नद** - पुं० పెద్ద నది.

**नदारद** - वि० అదృశ్యమైన; మాయమైన.

**नदी** - स्त्री० నది; జీవనది.

**ननद** - स्त्री० భర్తసోదరి; ఆడబిడ్డ.

**ननदोई** - पुं० భర్తసోదరిభర్త; ఆడబిడ్డభర్త.

**ननसार** - स्त्री० తల్లితండ్రి ఇల్లు.

**ननिहाल** - पुं० दे० ननसार.

**नन्हा** - वि० बहुत छोटा ; చాల చిన్న.

**नपाई** - स्त्री० కొలత; కొలత కూలి.

**नपुंसक** - पुं० నపుంసకుడు; మగతనము లేనివాడు.

**नब्ज** - स्त्री० నాడి.

**नमक** - पुं० ఉప్పు; లవణము.

**नमकसार** - पुं० ఉప్పు కొఠారు.

**नमकहराम** - पुं० కృతఘ్నుడు.

**नमकहलाल** - पुं० కృతజ్ఞుడు.

**नमकीन** - वि० ఉప్పు కలిసిన; ఉప్పురుచిగల; అందమైన మనోహరమైన; ఉప్పు కలసిన పక్వానము.

**नमन** - पुं० వంపు; నమస్కారము; ప్రణామము.

**नमस्ते** - पुं० మీకు నా నమస్కారము.

**नमाज** - पुं० మహమ్మదీయుల ప్రార్థన.

**नमूना** - पुं० बानगी; నమూన; మాదిరి.

**नम्र** - वि० विनीत ; వంగిన; వినయముగల.

**नम्रता** - स्त्री० వినయము; అణుకువ.

**नया** - वि० క్రొత్త; నూతనమగు.

**नया-नबेला** - वि० నవయువకుడు; నౌజవానుడు.

**नर** - पुं० మనిషి; పురుషుడు; విష్ణువు; శివుడు; అర్జునుడు.

**नरम** - वि० మెత్తని; కోమలమైన.

**नरमी** - स्त्री० మెత్తదనము; కోమలత.

**नरसों** - क्रि०वि० గడచిన నాల్గవరోజు; రాబోవు నాల్గవరోజు.

**नर्तक** - पुं० నర్తకుడు; నృత్యముచేయువాడు.

**नर्तकी** - स्त्री० నర్తకి; నృత్యము చేయునది.

**नर्दन** - पुं० భయరంకరమైన.

**नल** - पुं० కుళాయి; పంపుగొట్టము; మురికి కాలువ.

**नलिनी** - स्त्री० కమలము; తామర.

**नव** - वि० క్రొత్త; నూతనమగు.

**नवना** - अ०क्रि० వంగుట.

**नवनीत** - पुं० मक्खन; వెన్న.

**नवल**-पुं० క్రొత్త; నవీనమగు; యవ్వనములోనున్న.

**नवला** - स्त्री० యువతి.

**नवाई** - स्त्री० నమ్రత.

**नवाजिश** - स्त्री० దయ; అనుగ్రహము.

**नवाब** - पुं० మొగలు చక్రవర్తుల ద్వార నియోగింపబడిన ఒక ప్రాంతపు శాసకుడు.

**नवाबजादा** - पुं० నవాబుకొడుకు; విలాసవంతుడు.

**नवीन** - वि० తాజా; నవీనమగు; అపూర్వమైన; నవయువకుడు.

**नवेला**-वि० క్రొత్త; నవీనమగు; యువకుడు.

**नवोढा** - स्त्री० కొత్తగా పెళ్ళి అయిన స్త్రీ; నవయౌవ్వనవతి.

**नशा** - पुं० మత్తుపదార్థ సేవనము వలన కలుగు మత్తు లేక మదము.

**नशतर** - पुं० ఆపరేషను చేయుటకు ఉపకరించు ఒక విధమగు కత్తి.

**नश्वर** - वि० నశించునట్టి.

**नष्ट-भ्रष्ट** - वि० పూర్తిగా భగ్నమైన; ధ్వంసమైన.

**नसाना** - अ०क्रि० నశించుట.

**नसीब** - पुं० అదృష్టము; ప్రారబ్దము.
**नसीब होना** - पुं० లభించుట; ప్రాప్తించుట.
**नहर** - स्त्री० కాలువ.
**नहसुत** - पुं० గోటిగీరు.
**नहान** - पुं० స్నానపర్వం; మైమ మొ.నవి అంతమైన దినము చేయు స్నానము.
**नहाना** - अ०क्रि० స్నానము చేయుట.
**नहीं** - अव्य० నిషేధము; సూచించు శబ్దము - లేదు; కాదు.
**नहीं तो** - पुं० లేనిచో; **नहीं सही** - पुं० అయినా పరవాలేదు; లేకపోతే లేకపోనీ.
**ना** - अव्य० నిషేధసూచక శబ్దము - లేదు, కాదు.
**नाइन** - स्त्री० మంగలి జాతి స్త్రీ.
**नाई** - वि० సదృశమైన; తుల్యమైన; సమాన స్థితి.
**नाई** - पुं० మంగలి; మంగలి మనిషి.
**नाउम्मेद**-वि० ఆశారహితమగు; హతాశుడు.
**नाउम्मेदी** - स्त्री० నిరాశ; హతాశ.
**नाक** - स्त्री० ముక్కు.
**नाकाम; ना-कारा** - वि० మనోరథము సద్దించని; నిరాశపడిన; పనికిమాలిన.
**नाकामयाब** - वि० ఫలించని; అసఫలమైన.
**नाखुश** - वि० అప్రసన్నమైన; కుపితమగు.
**नाखुशी** - स्त्री० అప్రసన్నత; కోపము.
**नाग** - पुं० సర్పము; పాము; ఏనుగు.
**नागरमोथा** - पुं० తుంగగడ్డి.
**नागरी** - स्त्री० నగరవాసిని; సఖ్యతగల స్త్రీ.
**नागवार** - वि० అప్రియమైన; నచ్చని.
**नागा** - स्त्री० నాగాజాతి మనిషి; ఒక విధమగు దిగంబర సాధువు; అనుపస్థితి నాగా.
**नाच** - पुं० నృత్యము.
**नाचघर; नाचमहल** - पुं० నృత్యశాల.
**नाज** - पुं० अनाज; ధాన్యము.
**नाजनी** - स्त्री० సుందరి; అందకత్తె.
**नाज-बालिश** - पुं० మెత్తని బాలీసు.
**नाजुक** - वि० నాజూకు; కోమలమైన; సున్నితమైన.
**नाटा** - वि० పొట్టి; కురచ.
**नाता** - पुं० బంధుత్వము; సంబంధము.
**नाती** - पुं० మనుమడు.
**नातेदार** - वि० బంధు- బాంధవులు.
**नादान** - वि० తెలియని; అమాయకమైన; అబోధమైన.
**नादानी** - स्त्री० తెలివిలేమి; అజ్ఞానము.
**नादार** - वि० బొత్తిగాలేనివాడు; కడుపేద.
**नादिम** - वि० సిగ్గునొందిన.
**नादिया** - पुं० గంగిరెద్దు.
**नाना** - पुं० పుదీనా; మాతామహుడు; అనేకములగు.

**बिजोग** - पु० दे० वियोग.
**बिजौरा** - पुं० గజనిమ్మకాయ.
**बिटिया** - स्त्री० दे० बेटी.
**बिडाल** - पुं० बिलाव ; పిల్లి (మగ).
**बिताना** - स०क्रि० గడపుట.
**बित्ता** - पुं० बालिश्त ; జానెడు.
**बिदा** - स्त्री० ప్రస్థానము; వెళ్ళుటకు శలవు; అనుజ్ఞ.
**बिदाई** - स्त्री० వీడ్కోలు.
**बिदारना** - स०क्रि० చీరుట; చీల్చుట.
**बिना** - अव्य० बगैर ; మినహా; పునాది.
**बिनौला** - पुं० పత్తిగింజ.
**बियाना** - स०क्रि० ब्याना ; ఈనుట.
**बिरथा** - वि० వ్యర్థమైన.
**बिरला** - वि० అరుదైన; అరుదగు.
**बिरवा** - पुं० మొలక; మొక్క.
**बिरादराना** - वि० సౌభ్రాతృత్వముగల; సోదర ఆప్యాయత గల.
**बिरादरी** - स्त्री० సోదర భావము; సౌభ్రాతృత్వము; ఒకే జాతి సమూహము.
**बिरान; बिराना** - वि० बेगाना.
**बिल** - पुं० రంధ్రము; కలుగు; కంత.
**बिलकुल** - क्रि०वि० మొత్తము; అంతా; పూర్తిగా; బొత్తిగా.
**बिलग** - वि० अलग ; వేరైన; వేరగు; పార్థక్యము.
**बिलटी** - स्त्री० రైల్వేపార్శిల్ రసీదు.
**बिलपना** - अ०क्रि० విలపించుట.
**बिल-मिक्ता**-वि० నిశ్చయించిన ప్రకారము.
**बिलोना** - स०क्रि० दे० बिलोडना.
**बिलोलना** - स०क्रि० కదిలించుట.
**बिल्ली** - स्त्री० పిల్లి; తలుపుగొళ్ళెము.
**बिल्लौर** - पुं० స్వచ్ఛమైన అద్దము; స్ఫటికము.
**बिसाती** - पुं० సూదులు, దారము, గాజులు మొ. వస్తువులను తిరుగుచు అమ్మువాడు.
**बिस्तर** - पुं० बिछौना ; పక్క.
**बिहान** - पुं० ప్రాతఃకాలము; రేపు.
**बी** - स्त्री० స్త్రీ; మహిళ.
**बीच** - पुं० మధ్య; నడుమ.
**बीचि** - स्त्री० తరంగము; అల.
**बीचोंबीच** - क्रि०वि० సరిగా మధ్యన; మధ్యలో.
**बीज** - पुं० బీజము; విత్తు.
**बीडा** - पुं० తమలపాకు బీడా లేక కిళ్ళీ.
**बीतना** - अ०क्रि० సమయము గతించుట; గడచుట.
**बीन** - स्त्री० వీణ.
**बीनना** - स०क्रि० ఏరుట; ఎన్నుట.
**बीबी** - स्त्री० భద్రమహిళ; స్త్రీ; భార్య.
**बीमार** - वि० జబ్బుగానున్న; రోగగ్రస్తమైన.

**बीमारी** - स्त्री० జబ్బు; రోగము.

**बीहड** - वि० మెరక పల్లములు గానున్న; చదునుగా లేని; వికముగు వేరు వేరుగానున్న.

**बुँद** - स्त्री० दे० बूँद.

**बुआ** - स्त्री० दे० बूआ.

**बुखार** - पुं० జ్వరము; తాపము.

**बुजदिल** - वि० భీరువు; పిరికిపంద.

**बुझना** - अ०क्रि० ఆరుట (పీదము మొ.) మనోవేగము చల్లపడుట.

**बुझाना** - स०क्रि० ఆర్పుట; చల్లార్చుట.

**बुड्ढा** - वि० ముసలి; వృద్ధావస్థలోనున్న.

**बुढापा** - पुं० ముసలితనము; వృద్ధావస్థ.

**बुढिया** - स्त्री० ముసలమ్మ.

**बुदबुद** - पुं० నీటి బుడగ.

**बुद्धिमानी** - स्त्री० తెలివి.

**बुद्धू** - पुं० అజ్ఞాని; మూర్ఖుడు; అమాయకుడు.

**बुनना** - स०क्रि० నేయుట (వస్త్రము).

**बुरा** - वि० చెడ్డ.

**बुरा**-वि० చెడు; చెడ్డతనము; నైచ్యము; నింద; దోషము.

**बुलंद** - वि० ఎతైన; బరువైన; తీవ్రమైన.

**बुलंदी** - स्त्री० ఎత్తు; తీవ్రత.

**बुलबुला** - स्त्री० నీటిబుడగ.

**बुलाना** - स०क्रि० పిలుచుట; మాట్లాడించుట.

**बुलावा** - पुं० పిలుపు; ఆహ్వానము.

**बुहारना** - स०क्रि० చీపురుతో ఊడ్చి శుభ్ర పరచుట.

**बूंद** - स्त्री० (నీటి) బిందువు; వీర్యము.

**बू** - स्त्री० వాసన; గంధము; దుర్వాసన.

**बूआ** - स्त्री० తండ్రిసోదరీ; మేనత్త.

**बूचडखाना** - पुं० కసాయి దుకాణము లేక కేంద్రము; పశువులు వధించుచోటు.

**बूझना** - स०क्रि० తెలిసికొనుట; ఎరుగుట; అడుగుట.

**बूटी** - स्त्री० వనమూలిక.

**बूडना**-अ०क्रि० डूबना; మునుగుట; నిమగ్నమగుట.

**बूढा** - पुं० ముదుసలి; వృద్ధుడు.

**बे** - अव्य० వ్యతిరేక అర్థమునిచ్చు ఒక ఉపసర్గము; రహితమైన; లేని; లేక చిన్న పిల్లలు; తుచ్ఛులు తిరసాకము సూచించు శబ్దము.

**बेअकल** - वि० బుద్ధిలేని.

**बेअदब** - वि० మర్యాదలేని.

**बे ईमान** - वि० నిజాయితీలేని.

**बेकदर** - वि० ప్రతిష్ఠ; గౌరవములేని.

**बेकरार** - वि० శాంతి సుఖములు లేని; వికలమైన.

**बेकरारी** - स्त्री० వ్యాకులత.

**बेक़सूर** - वि० దోషములేని; నిర్దోషి.

**बेकार** - वि० పనిలేని.

**बेकायदा** - वि० నియమవిరుద్ధమైన.

**बेखटेके** - क्रि०वि० నిస్సంకోచముగా.

**बेखबर** - वि० స్పృహలోని; జ్ఞానములేని.

**बेगम** - स्त्री० గొప్పవాని ఇల్లాలు; రాణి.

**बेगम** - वि० దుఃఖములేని; ఇబ్బందిలేని.

**बेगरज** - पुं० లక్ష్యపెట్టని; ఆవశ్యకతలేని.

**बेगाना** - वि० పరాయి; ఇతరమైన; పరిచయములేని.

**बेगारी** - पुं० ఊడిగము చేయువాడు; వెట్టిచాకిరి చేయువాడు.

**बेगुनाह** - वि० దోషములేని; పాపములేని.

**बेचना** - स०क्रि० అమ్ముట.

**बेचारा** - वि० దిక్కులేని; దీనస్థితిలోనున్న.

**बेचैन** - वि० వికలమైన.

**बेजा** - वि० తగని; అనుచితమైన; చెడ్డ.

**बेजान** - वि० ప్రాణములేని; చనిపోయిన.

**बेजार** - वि० దుఃఖముగల; కుపితమైన; విశాలమైన.

**बेजोड** - वि० అద్వితీయమైన; సాటిలేని.

**बेटा** - पुं० కుమారుడు; కొడుకు.

**बेटी** - पुं० కుమార్తె; కూతురు.

**बेडी**-स्त्री०తీరుతెన్నులేని; కురూపముగల.

**बेतार का तार** - यौ० తీగద్వారా కాని తంతి.

**बेतुका** - वि० సామంజస్యములేని; పొందిక లేని; వికృతమైన.

**बेदम** - वि० శ్వాసలేని; చనిపోయిన; మృత ప్రాయమైన.

**बेनसीब** - वि० అదృష్టములేని.

**बेपरवा; बेपरवाह** - वि० నిశ్చింతయైన; లక్ష్యపెట్టని.

**बेपीर** - वि० నిర్దయమగు; నిష్ఠురమగు.

**बेफायदा** - वि० లాభములేని; వ్యర్థముగా.

**बेफिक्र** - क्रि०वि०నిశ్చింతంగ; నిర్లక్ష్యముగ.

**बेबाक** - वि० బాకీతీర్చిన; ఋణము తీర్చిన.

**बेमौका** - वि० అదను లభించని.

**बेमौसम** - वि० ఋతువుకానిది; ఋతువు కాకపోయినను లభించునది.

**बेर**-पुं०రేగిపండు; సమయము; పర్యాయము.

**बेल** - पुं० మారేడు स्त्री० లత; సంతానము; వంశము.

**बेलन** - पुं० అప్పడాలకర్ర.

**बेलना** - स०क्रि० అప్పడాలకర్రతో వత్తుట (రొట్టె) పాడుచేయుట.

**बेला** - पुं० మల్లెజాతి పువ్వు; సమయము; వేళ.

**बेवकूफ**-वि० నిర్బుద్ధి; తెలివిలేని; అజ్ఞాని.

**बेवक्त** - क्रि०वि० కుసమయమున; వేళకాని వేళలో.

**बेशक** - क्रि०वि० నిస్సందేహముగా; తప్పకుండా.

**बेशकीमत** - वि० ఎక్కువ వెలగల; బహు మూల్యమైన.

**बेशरम** - वि० సిగ్గులేని.

**बेशी** - स्त्री० ఆధిక్యము.

**बेशुमार** - वि० అసంఖ్యాకమైన; లెక్కలేని.

**बेसमझ** - वि० తెలివిలేని; మూర్ఖతగల.

**बेहतर** - वि० మెరుగు.

**बेहद** - वि० అపరిమితమైన; అపారమైన; హద్దులేని.

**बेहया** - पुं० సిగ్గులేని; సిగ్గుమాలిన.

**बेहूदा** - वि० మర్యాదతెలియని; సభ్యతలేని.

**बेहोश** - वि० స్పృహలేని; మూర్ఛపోయిన.

**बेहोश** - वि० స్పృహలేని; మూర్ఛ.

**बैंक** - पुं० బ్యాంక్.

**बैंगन** - पुं० వంకాయ.

**बैठक** - स्त्री० కూర్చుండు స్థలము; పీట; ఒక విధమగు గుంజీ లేక ఆసనము.

**बैठना** - अ०क्रि० కూర్చుండుట.

**बैद** - पुं० వైద్యుడు.

**बैल** - पुं० ఎద్దు; వృషభము.

**बैस** - स्त्री० వయస్సు; యవ్వనము.

**बैसाखी** - स्त्री० కుంటివాని పోటీకర్రలు.

**बैसाना** - स०क्रि० కూర్చుండపెట్టుట.

**बोआई** - स्त्री० నాట్లుపని; నాటినందులకు కూలి.

**बोझ** - पुं० बोझा ; భారము; బరువు.

**बोझिल** - वि० బరువైన; భారమైన.

**बोटी** - स्त्री० మాంసఖండము; మాంసపు ముక్క.

**बोतल** - स्त्री० సీసా.

**बोध** - पुं० జ్ఞానము; ఎరుక; తెలివి.

**बोना** - स०क्रि० విత్తనమునాటుట; విత్తనములు జల్లుట.

**बोरना** - स०क्रि० ముంచుట.

**बोरा** - पुं० గోనిసంచి.

**बोरी** - स्त्री० చిన్నగోనిసంచి.

**बोल** - पुं० మాట; పలుకు.

**बोल बाला**-पुं०పలుకుబడి; మాటవిలువ.

**बोलचाल**-स्त्री०సంభాషణ; మాటమంతి; ప్రచారములోనున్నది.

**बोली** - स्त्री० మాట; పలుకు; వాణి.

**बोहनी** - स्त्री० బోణీ.

**बौना** - पुं० మరుగుజ్జువాడు.

**बौर** - पुं० మామిడిచిగురు.

**बौरना** - अ०क्रि० మామిడిపూతవచ్చుట.

**ब्याज** - पुं० వడ్డీ; వృద్ధి.

**ब्याना** - स०क्रि० ఈనుట.

**ब्यापना** - अ०क्रि० వ్యాపించుట.

**ब्याह** - पुं० వివాహము; పెళ్ళి.

**ब्याहना** - स०क्रि० పెళ్ళిచేసుకొనుట.

## भ

**भंगड** - वि० ఎక్కువగా భంగు త్రాగువాడు.

**भंगी** - पुं० పాకీవాడు; భంగు త్రాగువాడు.

**भँवर** - पुं० నీటిసుడి; భ్రమరము.

**भक्ष्य** - वि० తినదగిన.

**भगत** - वि० భక్తుడు; ఉపాసకుడు.

**भगदड** - स्त्री० పలాయనము; భయపడి నలువైపులా పరారగుట.

**भगिनी** - स्त्री० సహోదరి; సోదరి.

**भजनी** - पुं० భజన చేయువాడు.

**भटकना** - अ०क्रि० వట్టినే తిరుగుట; దారి తప్పి తిరుగుట.

**भटका** - वि० దారితప్పిన.

**भडकना** - अ०क्रि० భగ్గుమనుట; సంకోచించుట; జంకుట; బెదురుట.

**भडकाना** - स०क्रि० ప్రజ్వలింపజేయుట; రెచ్చగొట్టుట; ప్రోత్సహించుట.

**भडुआ** - पुं० తార్పుడుగాడు.

**भतीजा** - पुं० సోదరుని కుమారుడు.

**भतीजी** - स्त्री० సోదరుని కుమార్తె.

**भत्ता**-पुं० నిర్ధారిత వేతనమునకు అదనముగా ఇచ్చు భత్యము; పైకము.

**भद्दा** - वि० చూచుటకు అందవికారముగా కనిపించు; కురూపమైన.

**भद्दापन** - पुं० సౌందర్యహీనత; అశ్లీలత; కురూపత.

**भभ्भड** - स्त्री० పెద్ద సమూహము; విచ్చల విడిగానున్న జనసందోహము.

**भभूत** - स्त्री విభూతి; భస్మము.

**भरता** - पुं० బజ్జి (వంకాయ).

**भरना** - स०क्रि० నింపుట; పూరించుట; పోయుట; తీర్చుట.

**भरमना** - अ०क्रि० తిరుగుట; దారి తప్పి తిరుగుట; భ్రమలో పడుట.

**भरोसा** - पुं० ఆసరా; ఆధారము; దృఢ విశ్వాసము.

**भर्त्सना** - स्त्री० నింద; చీదరింపు; చివాట్లు.

**भर्राना** - अ०क्रि० బొంగురు పోవుట (స్వరము).

**भलमनसाहत ; भलमनसी** - स्त्री० సౌజన్యము; సజ్జనత్వము.

**भला** - वि० మంచి; శ్రేష్ఠమైన; पुं० కుశలము; మంచితనము; अव्य० బాగు; సరే.

**भले ही** - मु० అలాగే జరుగుగాక; ఏమీ నష్టములేదు; మంచిదే.

**भलाई** - स्त्री० మంచితనము; ఉపకారము.

**भाँग** - स्त्री॰ భంగు ఆకు.
**भाँटा** - पुं॰ बैंगन ; వంకాయ.
**भा** - स्त्री॰ దీప్తి; కాంతి.
**भाई** - पुं॰ సోదరుడు.
**भाईचारा** - पुं॰ భాతృత్వము; సౌహార్ద్రత.
**भाग** - पुं॰ భాగము; ఖండము; భాగాహారము (గణితము); అదృష్టము.
**भागना** - अ॰क्रि॰ పారిపోవుట.
**भाजी** - स्त्री॰ ఆకుకూర; కూరగాయలు.
**भाज्य** - स्त्री॰ భాజ్యము (గణితము); భాగించబడు సంఖ్య; విభజింపదగిన.
**भाट** - पुं॰ భట్రాజు; వందిమాగదుడు.
**भाटा** - पुं॰ నీటిపొంగు తగ్గుదల.
**भाड** - पुं॰ ఒక్క విధముగు పెద్ద పొయ్యి.
**भाडा** - पुं॰ బాడుగ; అద్దె.
**भात** - पुं॰ అన్నము.
**भाति** - स्त्री॰ శోభ; కాంతి.
**भानजा** - पुं॰ మేనల్లుడు.
**भाभी** - स्त्री॰ అన్నభార్య; వదిన.
**भामिनी** - स्त्री॰ స్త్రీ.
**भारी** - वि॰ బరువైన; బరువుగానున్న.
**भाल** - पुं॰ ఫాలభాగము; లలాటము.
**भाला** - पुं॰ బల్లెము; బరిసె.
**भालू** - पुं॰ ఎలుగుబంటి.
**भाषण** - पुं॰ ఉపన్యాసము.
**भासित** - वि॰ మెరయుచున్న; ప్రకాశించు చున్న; ప్రకాశవంతమైన.
**भिंडी** - स्त्री॰ బెండకాయ.
**भिक्षु** - पुं॰ బౌద్ధ సన్యాసి.
**बिखमंगा-भिखारी** - पुं॰ బిచ్చగాడు.
**भिखारिन** - स्त्री॰ బిచ్చగత్తె.
**भिडना** - अ॰क्रि॰ ఢీకొనుట.
**भींगना** - अ॰क्रि॰ दे॰ भीगना.
**भी** - अव्य॰ కూడ; అవశ్యము; వరకు.
**भीख** - स्त्री॰ బిచ్చము.
**भीड** - स्त्री॰ సమూహము; గుంపు; విపత్తు; సంకటము.
**भीडा** - वि॰ సంకుచితమైన; ఇరుకైన.
**भीतर** - क्रि॰वि॰ లోపల.
**भीतरी** - वि॰ లోని; గుప్తమైన.
**भुखमरा** - वि॰ ఆకలితో చనిపోవు; తిండి బోతు.
**भुगतना**-पुं॰ సహించుట; అనుభవించుట.
**भुजपाश** - पुं॰ गलबाँही ; మెడ కౌగలించు కొనుట; మెడకౌగిలి.
**भुट्टा** - पुं॰ మొక్కజొన్న పొత్తి లేక కండె.
**भुनना** - अ॰क्रि॰ వేయించబడుట; చిల్లర మార్చుట; చెక్కు మొ. మార్చబడుట; మార్చబడుట (చిల్లర మొ.).
**भुनाना** - स॰क्रि॰ మార్పించుట; చిల్లర

లోనికి మార్చుట.

**भुरता** - पुं० తొక్కి తయారుచేసిన బజ్జి.

**भुलक्कड** - वि० అతిగా మరుపుగల; మరుపిష్టి.

**भुलाना** - स०क्रि० మరపించుట.

**भूख** - स्त्री० ఆకలి; ఆవశ్యకత; కానుక.

**भूखा** - वि० ఆకలిగొన్న.

**भूतपूर्व** - वि० మాజీ; ఇంతకు పూర్వము.

**भूनना** - स०क्रि० వేయించుట; అతిగా కష్టపెట్టుట.

**भूल** - स्त्री० మరుపు; పొరపాటు; అశుద్ధి; దోషము.

**भूसा** - पुं० గొప్ప; ధాన్యపుపొట్టు; పొల్లు వైరా.

**भूसी** - स्त्री० చిట్టు; తవుడు; ఊక మొ.వి.

**भृकुटी** - स्त्री० కనుబొమ.

**भृत** - पुं० దాసుడు; वि० నిండియున్న; పోషించబడిన.

**भेंट** - स्त्री० కలయిక; కానుక.

**भेंटना** - स०क्रि० కలియుట; కౌగిలించుకొనుట; దర్శించుట.

**भेजना** - स०क्रि० పంపుట.

**भेड** - स्त्री० भेडी ; ఆడ గొర్రె.

**भेडिया धँसान**-मु० గుడ్డిగా అనుసరించుట.

**भेडिया** - पुं० తోడేలు.

**भेद** - पुं० భేదము; తేడా; రహస్యము; ఛేదనము.

**भेदिया** - पुं० గుప్తచరుడు; వేగులవాడు.

**भैया** - पुं० సోదరుడు; సమవయస్కువారిని సంబోధించు శబ్దము.

**भोंदू** - वि० మూర్ఖమగు.

**भोगना**-स्त्री० అనుభవించుట; సహించుట.

**भोज** - पुं० విందు.

**भोर** - पुं० ప్రాతఃకాలము; భ్రమ; దగా.

**भोला** - वि० అమాయకమైన; కల్లకపట మెరగని.

**भोलापन** - पुं० అమాయకత్వము; సరళత; నిరాడంబరత.

**भोलाभाला** - वि० సరళ స్వభావముగల; నిరాడంబరి; కల్లకపట మెరుగని.

**भौं** - स्त्री० दे० भौंह.

**भौंकना** - अ०क्रि० दे० भूँकना.

**भौंह** - स्त्री० కనుబొమ.

**भौचक** - वि० నిర్ఘాంతపోయిన; స్తంభించిన.

**भ्रमर** - पुं० भौरा ; తుమ్మెద.

## म

**मंजरी** - स्त्री० చిగురుటాకు; పల్లవము; లత.

**मंजीर** - पुं० కాలి అందె.

**मंजु** - वि० సుందరమైన; మనోహరమైన.

**मंजूर** - वि० అంగీకరించిన; స్వీకరింపబడిన.

**मंजूरी** - स्त्री॰ స్వీకృతి; అంగీకారము.

**मंझला** - वि॰ మధ్య; మాధ్యమికము.

**मंडी** - स्त्री॰ విపణివీధి; సంత.

**मंशा** - स्त्री॰ కోరిక; అభిప్రాయము; ఆశయము.

**मंसब** - पुं॰ పదవి; అధికారము; కర్తవ్యము.

**मँहगा** - वि॰ दे॰ महँगा.

**मकई** - स्त्री॰ మొక్క జొన్న.

**मकडी** - स्त्री॰ చిన్నసాలీడు.

**मकतब** - पुं॰ పాఠశాల.

**मकबरा** - पुं॰ సమాధి.

**मकबूल**-वि॰అంగీకరించబడిన; ప్రియమైన; మనోహరమైన.

**मकान** - पुं॰ గృహము.

**मकाम** - पुं॰ दे॰ मुकाम.

**मकोडा** - पुं॰ చిన్న పురుగు.

**मकोय** - स्त्री॰ కామంచి మొక్క లేక పండు.

**मक्कार** - वि॰ కపటి; దగాకోరు.

**मक्खन** - पुं॰ नवनीत ; వెన్న.

**मक्खी** - स्त्री॰ ఈగ.

**मक्खीचूस** - पुं॰ పిసినిగొట్టు; పిసినారి.

**मखदूम** - पुं॰ యజమాని.

**मखौल** - पुं॰ ఎగతాళి.

**मगर** - पुं॰ మొసలి; పెద్దచేప; కాని.

**मगरूर** - वि॰ గర్విష్టి; దర్పముగల; గర్వము గల.

**मचलाई** - स्त्री॰ మారాము; మొరాయింపు.

**मजदूरी** - स्त्री॰ కూలిపని; కూలి.

**मजबूर** - वि॰ వివశమైన; గత్యంతరములేని.

**मजबूरी** - स्त्री॰ నిస్సహాయత; గత్యంతరము లేని.

**मजहब** - पुं॰ మతము; సంప్రదాయము.

**मजा** - पुं॰ రుచి; స్వాదము; ఆనందము; ఉల్లాసము.

**मजाक** - पुं॰ ఎగతాళి; వేళాకోళము.

**मजाल** - स्त्री॰ శక్తి; సామర్థ్యము; సాహసము.

**मजिल** - स्त्री॰ दे॰ मंजिल.

**मजिल** - स्त्री॰ दे॰ मंजिल.

**मजेदार** - पुं॰ రుచిగల; రుచికరము; ఉల్లాస కరమైన.

**मटकना** - अ॰क्रि॰ ఒయ్యారముగా నడుచుట; కులుకుట.

**मटका** - पुं॰ పెద్దకుండ.

**मटकाना** - स॰क्रि॰ ఒయ్యారము పోవుట; వగలు చేయుట; వగలు ప్రదర్శింప జేయుట.

**मटकी** - स्त्री॰ పిడత; చిన్నకుండ.

**मटमैला** - वि॰ బూడిద రంగుగల; ఖాకీ రంగుగల.

**मटर** - पुं॰ బఠాణి.

**मट्टी** - स्त्री० दे० मिट्टी.

**मट्ठा** - पुं० छाछ ; మజ్జిగ.

**मडई** - स्त्री० చిన్న మండపము; గుడిసె.

**मढी** - स्त्री० కుటీరము; గుడిసె.

**मत** - पुं० నిశ్చితమైన సిద్ధాంతము; అభిప్రాయము; సంప్రదాయము; ఓటు; వద్దు (నిషేధసూచకము).

**मतभेद** - पुं० అభిప్రాయభేదము.

**मतलब** - पुं० అర్థము; తాత్పర్యము; ఆశయము; స్వార్థము.

**मतलबी** - वि० స్వార్థి; స్వార్థపరుడు.

**मतली** - स्त्री० दे० मिचली.

**मतवाला** - वि० నిషాలోనున్న; మత్తెక్కిన.

**मथना** - स०क्रि० చిలుకుట (పెరుగు మొ.) మథించుట; గౌరవించుట; కవ్వము.

**मदद** - स्त्री० సహాయము.

**मददगार** - वि० సహాయము చేయువాడు; సహాయకుడు.

**मदमत्त** - वि० మత్తుమదించిన; మత్తెక్కిన.

**मदरसा** - पुं० विद्यालय ; పాఠశాల.

**मदारी** - पुं० కోతులను, ఎలుగుబంట్లను ఆడించువాడు; గారడీవాడు.

**मन** - पुं० మనస్సు; చిత్తము; కోరిక; సంకల్పము; అభిప్రాయము.

**मनमाना** - वि० స్వేచ్ఛానుసారము; ఇష్టానుసారము.

**मनचला** - वि० నిశ్చయమగు; సాహసియగు; రసికుడు.

**मनजर** - पुं० దృశ్యము.

**मनन**-पुं० చింతన; బాగా అధ్యయనించుట.

**मनसबदार** - पुं० పదవిలోనున్నవాడు; హోదాపరుడు.

**मानौती ; मन्नत**-स्त्री० మొక్కు; సంకల్పం; మొక్కుబడి.

**ममता** -स्त्री० మమత్వము; స్నేహము; ప్రేమ; వాత్సల్యము; మోహము.

**ममेरा** - वि० మేనమామకు జన్మించిన.

**मयस्सर** - वि० ప్రాప్తించిన; లభ్యమైన.

**मरघट** - पुं० శ్మశానము.

**मरदानगी** - स्त्री० పుంసత్వము; సాహసము; శౌర్యము; వీరత్వము.

**मरदूद** - वि० నీచమైన; హేయమైన; త్యజింపబడిన.

**मरना** - अ०क्रि० చనిపోవుట; చచ్చుట.

**मरमर** - पुं० చలువరాయి.

**मरम्मत** - स्त्री० మరమ్మత్తు; బాగుచే

**मरहम** - पुं० మలాము; గాయములపై బడు ఒక లేపనము.

**मरियल** - वि० దుర్బలమైన; చావుకి గావున్న.

**मरीज** - पुं० రోగి; రోగగ్రస్తుడు.
**मरुभूमि** - स्त्री० ఎడారి.
**मरोडना ; मरोरना** - स०क्रि० మెలిపెట్టుట; మర్దించి దుఃఖము కలిగించుట; మెలి పెట్టిచంపుట; పీడించుట.
**मर्द** - पुं० మనుష్యుడు; పురుషుడు.
**मर्यादा**-स्त्री० సీమ; హద్దు; మర్యాద; ప్రతిష్ఠ.
**मलना** - स०क्रि० మర్దించుట; నులుముట; మాలిషు చేయుట.
**मलाई**-स्त्री० మీగడ; మర్దన; మర్దించినందులకు కూలి; తోమినందుకు కూలి.
**मवाजी** - वि० మొత్తము; సాధారణముగా సమానమైన; దాదాపు.
**मवाद** - पुं० చీము; మసాలా సామగ్రి.
**मवेशी** - पुं० పశువు; జంతువు.
**मवेशीखाना** - पुं० పశువుల దొడ్డి.
**मशहूर** - वि० ప్రఖ్యాతమైన.
**मशाल** - स्त्री० కాగడా.
**मशीन** - स्त्री० యంత్రము; మిషను.
**मश्क** - पुं० అభ్యాసము.
**मश्कूक** - वि० సందేహముగల; సంద్గిగ్ధమైన.
**मसखरा** - पुं० ఎగతాళిచేయువాడు; పరిహాసము చేయువాడు.
**मसखरी** - स्त्री० వినోదము; వేళాకోళము.
**मसजिद** - स्त्री० మసీదు.
**मसहरी** - स्त्री० मच्छरदानी ; దోమతెర.
**मसा** - पुं० పురిపిరికాయ; సూరిడికాయ.
**मसान** - पुं० मरघट ; శ్మశానము.
**मसालेदार** - वि० మసాలా కలిసిన.
**मसि** - स्त्री० సిరా; కాటుక.
**मसूडा** - पुं० పళ్ళ చిగుళ్ళు.
**मसूर** - पुं० मसुरी ; ఒక విధమగు పప్పు ధాన్యము; కంది పప్పు వలె, ఎరుపుగా నుండు ఒకపప్పు ధాన్యము.
**मसोसना** - अ०क्रि० లోలోపల రోదించుట; శోకించుట; దుఃఖముతో మెలి తిరుగుట.
**मस्त** - वि० मत्त ; మత్తెక్కిన; మదించిన.
**मस्ती** - स्त्री० మత్తు; మదము.
**महँगा** - वि० ప్రియమైన; ఎక్కువగల.
**महँगाई**-स्त्री०महँगी;महँगापन ; ప్రియము.
**महकना** - अ०क्रि० పరిమళించుట; గుబాళించుట.
**महज** - वि० కేవలము.
**महरी** - स्त्री० कहारिन ; దాసి.
**बहलसरा** - स्त्री० అంతఃపురము.
**महसूल** - पुं० శిస్తు; పన్ను; బాడుగ.
**महसूस**-वि० అనుభూతమైన; అనుభవమైన.
**महावत** - स्त्री० మావటివాడు.
**महावर** - पुं० పారాణి.

**महीन** - वि० సన్నని; పల్చని.

**महीना** - पुं० నెల; మాసము; స్త్రీలమాసిక ధర్మము; రజోధర్మము.

**माँ** - स्त्री० మాత; తల్లి.

**माँग**-स्त्री० అడుగుడు; యాచన; ఆవశ్యకత; పాపిడి.

**माँगना**-स०क्रि० అడుగుట; యాచించుట; కోరుట.

**माँजना**-स०क्रि० తోముట; శుభ్రపరచుట.

**माइका** - पुं० दे० मायका.

**माई** - स्त्री० జనని; తల్లి.

**माकूल** - वि० ఉచితమైన; సమంజసమైన; యోగ్యమైన; శ్రేష్ఠమైన.

**माखन** - पुं० दे० मक्खन.

**माता** - स्त्री० माँ ; జనని.

**मात्रा** - स्त्री० పరిమాణము; మోతాదు.

**मान** - पुं० గౌరవము; అభిమానము; పరిమాణము; కొలత; కొలదండము; సామర్థ్యము; **मान रखना** मु० గౌరవించుట.

**मानचित्र** - पुं० नकशा; పటము.

**माननीय** - वि० గౌరవింపదగిన.

**माने** - पुं० అర్థము; ఆశయము.

**मानो** - अव्य० వలె; అనునట్లు; ఇలా ఉన్నాదా అన్నట్లు.

**मान्य** - वि० పూజ్యమగు; పూజనీయమైన; ఆదరణీయమైన.

**मापना** - स०क्रि० కొలుచుట; తూచుట.

**माफ** - वि० క్షమింపబడిన.

**माफी**-स्त्री० క్షమ; క్షమార్పణ; ప్రభుత్వము ద్వారా పన్ను రద్దు అయిన భూమి.

**मामला** - पुं० వివాదాస్పద విషయము; వ్యాజ్యము; వ్యవహారము.

**मामा** - पुं० మేనమామ; स्त्री० తల్లి; దాసి.

**मामूल** - पुं० రీతి; రివాజు.

**मायका** - पुं० పుట్టిల్లు.

**मार** - पुं० కామదేవుడు; విషము; ఉమ్మెత్త; स्त्री० దెబ్బ; ఆఘాతము.

**मारकाट** - स्त्री० యుద్ధము; కొట్లాట.

**मारना** - स०क्रि० వధించుట; చంపుట; కొట్టుట.

**मारपीट** - स्त्री० दंगा फसाद; కొట్లాట.

**मारे** - अव्य० వల్ల; కారణమున.

**मार्केका** - वि० మహత్వములగల; మహత్వపూర్ణమైన.

**मार्गी** - पुं० బాటసారి; యాత్రికుడు.

**मार्जर** - पुं० శుభ్రత; క్షమార్పణ.

**मार्फत** - अव्य० ద్వారా.

**माल** - स्त्री० సంపత్తి; సామగ్రి.

**मालगुजार**-पुं० భూమిపన్నుచెల్లించు వాడు.

**मालगोदाम** - पुं० సామానుల నిలవకొట్టు.

**मालम** - स्त्री० పంక్తి; వరుస; పుష్పహారము.
**मालमाल** - वि० బహుసంపన్నమగు.
**मालिक** - पुं० యజమాని; భర్త; అధిపతి; భగవంతుడు.
**मालिश** - स्त्री० మర్దనము; మాలిషు.
**माली** - पुं० తోటమాలి; वी० ఆర్థికమైన; ధనసంబంధమైన.
**मालूम** -वी० తెలిసిన; పరిచితమైన.
**मालूम हेना** - अ०क्रि० తెలియుట.
**मावस** - स्त्री० అమావాస్య.
**मासूम** - वि० ఏమీ తెలియని; అమాయక మైన.
**माह** - पुं० మాఘవాసము; మాసము.
**माहवार** - क्रि०वि० ప్రతినెల.
**मिचलाना** - अ०क्रि० వికారము పుట్టుట; డోకు వచ్చుట.
**मिचली** - स्त्री० వమనము; డోకు.
**मिजाज**-पुं० స్వభావము; ధర్మము; స్వాభావి కమగు మనస్సు.
**मिटना** - अ०क्रि० నశించుట; తుడుచుకు పోవుట.
**मिटाना** - स०क्रि० నాశనము చేయుట; విస్మ్ర పరచుట; తుడిచివేయుట.
**मिट्टी** - स्त्री० మట్టి; నేల; భూమి.
**मिट्टी का तेल** - पुं० కిరసనాయిలు.
**मिठाई** - स्त्री० మిఠాయి; తీపిదనము.
**मिठास** - स्त्री० మాధుర్యము; తీపిదనము.
**मिय्या** -वि० झूठा అసత్యమైన.
**मिनाह** - पुं० తగ్గించిన; మినహాయించిన.
**मिन्नत** - स्त्री० ప్రార్థన; నివేదన.
**मियाँ** -पुं० యజమాని; భర్త; మహాశయుడు.
**मिरचा** - पुं० ఎండుమిర్చి; మిరపకాయ.
**मिर्च** - स्त्री० మిరపకాయ; మిరియము.
**मिलन**-अ०क्रि० కలయిక; మిశ్రమము; కల్తీ.
**मिलनसार** - वि० కలిసిమెలిసి సంచరించు వాడు.
**मिलना**-अ०क्रि०కలియుట; కలిసిపోవుట; అంటుకొనుట; లభించుట; దొరుకుట
**मिलान** - पुं० కలయిక; తులన; పోలిక.
**मिलावट** - स्त्री० కల్తీ; కలయిక.
**मिश्रित** - वि० కలిసియున్న; కలిపిన.
**मिश्री** - पुं० పటికబెల్లము; కలకండ; మిశ్ర దేశపు (ఈజిప్టు) నివాసి.
**मिष** - पुं० మోసము; దగా; నెపము; వంక; ఈర్ష్య.
**मिष्ट** - पुं० తియ్యని.
**मिस** - पुं० నెపము; వంక; వంచన.
**मीठा** - वि० తియ్యని; पुं० మిఠాయి.
**मीठा तेल** - पुं० నువ్వులనూనె.
**मीठा नीबू** - पुं० మాదీఫలము.

**मीनार**-स्त्री॰ఎత్తయిన స్తంభము ; గోపురము.
**मील** - पुं॰ మైలు.
**मुंडन** - पुं॰ ముండనము; క్షురకర్మ; క్షవరము.
**मुंडन**- अ॰क्री॰ గొరగబడుట; క్షవరమగుట; మోసబోవుట; దోపిడి అగుట.
**मुंसिफ** - पुं॰ న్యాయమూర్తి; మునసబు.
**मुँह** - पुं॰ నోరు.
**मुँहचेर**-वि॰ఎదుట పడుటకు సంకోచించు.
**मुँहबोला** - वि॰ మాటవరసకి; వరుసకి.
**मुहासा** - पुं॰ యవ్వన ప్రారంభములో ముఖమున కనిపించు మొటిమలు.
**मुकदमेबाज** - पुं॰ వ్యాజ్యాలకోరు.
**मुकाबला** - पुं॰ ఎదురు బదురు; పోటీ; వ్యతిరేకము.
**मुकाम** -पुं॰ మకాము; విశ్రమించు ప్రదేశము.
**मुकुट** - पुं॰ ताज; కిరీటము.
**मुक्क** - पुं॰ పిడికిలి; గుద్దు.
**मुकित** - पुं॰ మోక్షము; ముక్తి.
**मुखडा** - पुं॰ चेहरा; ఆననము; ముఖము.
**मुखतार**-पुं॰ చట్టరీత్యా ప్రతినిధి; ప్రతినిధి.
**मुखरित** - पुं॰ ప్రతిధ్వనించు.
**मुखाग्र** - पुं॰ కంఠస్థమైన.
**मुखिया** - पुं॰ నాయకుడు; సర్దారు.
**मुगल** - पुं॰ సంక్షేపముగ; కొద్దిలో.
**मुटाई** - स्त्री॰స్థూలత; పుష్టి; అహంకారము.
**मुष्टी** - स्त्री॰ ముష్టి; గుప్పెడు; పిడికిలి.
**मुठभेड** - स्त्री॰ ఢీకొనుట; పోరాటము; ఎదిరించుట.
**मुदाम** - क्रि॰वि॰ ఎల్లప్పుడు; నిరంతరము.
**मुदित**-वि॰ ఆనందముగల; సంతోషముగల.
**मुद्दई** - पुं॰ దావాచేయువాడు; వాది; శత్రువు; వైరి.
**मुद्रक** - पुं॰ అచ్చువేయువాడు.
**मुद्रिका** - स्त्री॰ ఉంగరము; దర్భ ఉంగరము; పవిత్రి; రూపాయి నాణెము.
**मुनक्का** - पुं॰ ఎండు ద్రాక్షపండు.
**मुनगा** - पुं॰ सहिंजन ; ములగ; మునగ.
**मुनासिब** - वि॰ తగిన; ఉచితమైన; యోగ్యమైన.
**मुफ्त** - वि॰ నిశుల్కమైన; ఊరకవచ్చు; వెల ఇవ్వవలసిన అవసరములేని.
**मुबारकबाद** - पुं॰ అభినందన.
**मुबारकबादी** - स्त्री॰ दे॰ मुबारकबाद.
**मुमकिन** - वि॰ సంభవమైన; వీలైన.
**मुरगा** - पुं॰ కోడిపుంజు.
**मुरझना** - अ॰क्रि॰ दे॰ मुरझाना.
**मुरझाना** - अ॰क्रि॰ ముణుచుకొని పోవుట.
**मुरदा** - पुं॰ చనిపోయిన ప్రాణి; మృతుడు, చనిపోయిన; వాడిపోయిన.
**मुरव्वत** - स्त्री॰ दे॰ मुरौवत.

**मुरव्वत** - पुं० ముఖమాటము; సంకోచము.
**मुर्ग** - पुं० दे० मुरगा.
**मुर्गी** - स्त्री० కోడిపెట్ట.
**मुर्दा** - पुं० दे० मुरदा.
**मुलाकात** - स्त्री० కలయిక; సందర్శనము.
**मुलायम** - वि० మెత్తని; మృదువైన; సున్నితమైన.
**मुल्क** - पुं० దేశము; ప్రాంతము.
**मुशायरा** - पुं० కవి సమ్మేళనము.
**मुष्टि** - स्त्री० పిడికిలి; గుద్దు;గుప్పిడి.
**मुकुराना** - अ०क्रि० చిరునవ్వు నవ్వుట.
**मुस्कुराहट** - स्त्री० మందహాసము; మృదు హాసము.
**मुसलधार** - वि० दे० मूसलधार.
**मुसाफिर** - पुं० యాత్రికుడు; బాటసారి.
**मुसाफिरखाना** - पुं० ధర్మశాల; సత్రవు.
**मुसीबत** - स्त्री० విపత్తు; సంకటము.
**मुस्तैद**-वि० తయారైన;సన్నద్ధమైన; జిత్తుల మారి
**मुस्तैदी** - स्त्री० సన్నద్ధత.
**मुहब्बत** - स्त्री० ప్రేమ; మైత్రి; స్నేహము.
**मुहल्ला** - पुं० दे० महल्ला या मोहल्ला.
**मुहावरा** - पुं० నానుడి; జాతీయము.
**मूँग** - स्त्री० పెసలు.
**मूँगफली** - स्त्री० వేరుశనగ కాయ.
**मूँछ** - स्त्री० మీసము.
**मूँडना** - स०क्रि० క్షవరము చేయుట; బురిడీ కొట్టి సొత్తు అపహరించుట; శిష్యునిగా చేసికొనుట.
**मूक** - वि० మూగ; వివశమైన.
**मूठ** - स्त्री० పిడి; పిడికిలి; పిడికెడు.
**मूतना** - अ०क्रि० మూత్రవిసర్జన చేయుట; ఉచ్చ పోయుట.
**मूली** - स्त्री० ముల్లంగి; వేరు; మూలిక.
**मूष ; मूषक; मूस** - पुं० चूहा ; ఎలుక.
**मूसर ; मूसल** - पुं० ముసలము; రోకలి.
**मृग** - पुं० మృగము; లేడి.
**मृगचम** - पुं० లేడి చర్మము.
**मृगछाला** - पुं० दे० मृगचम.
**मृगजल** - पुं० ఎండమావి తరంగాలు.
**मेंड** - स्त्री० मेड ; చేనుగట్టు.
**मेख** - स्त्री० మేకు; గసిక.
**मेघराज** - पुं० ఇంద్రుడు.
**मेज** - स्त्री० బల్ల.
**मेजबान** - पुं० ఆతిథ్యము ఇచ్చువాడు.
**मेड** - स्त्री० చేనుగట్టు; హద్దు; గౌరవము.
**मेढक** - पुं० కప్ప.
**मेथी** - स्त्री० మెంతికూర (ఆకు).
**मेमार** - पुं० భవన నిర్మాత; తాపీపని మనిషి.
**मेल** - पुं० కలయిక; మైత్రి; స్నేహము; సాంగత్యము.

**मेलना** - स०क्रि० जोडना; కలుపుట.
**मेला** - पुं० ఉత్సవము; తిరనాళ్ళు.
**मेवा** - पुं० ద్రాక్ష; కిస్మిస్; బాదం; అఖరోట్ మొదలగు ఎండు పండ్లు.
**मेष** - पुं० గొర్రె.
**मेहँदी** - स्त्री० గోరింట; గోరింటాకు.
**मेह** - पुं० మేఘము; వానజల్లు.
**मेहतर** - पुं० भंगी ; శ్రేష్ఠమున వ్యక్తి.
**मेहतरानी** - स्त्री० పాకీ స్త్రీ.
**मेहनत** - पुं० శ్రమ; ప్రయాస.
**मेहनती** - पुं० కష్టించువాడు; శ్రమించువాడు.
**मेहमान** - पुं० అతిధి.
**मेहरबानी** - स्त्री० దయ; కృప.
**मेहरा** - पुं० ఆడంగిరేకువాడు; నపుంసకుడు.
**मैना** - पुं० ఒకవిధమగు నల్లని పెంపుడు పిట్ట; చిలక మాదిరిగా మాటలు నేర్చు పిట్ట.
**मैया** - स्त्री० माँ, माता ; తల్లి; అమ్మ.
**मैल** - स्त्री० మాలిన్యము; మురికి; దోషము; వికారము.
**मैला** - वि० మలినమైన; మురికైన.
**मोकल** - वि० స్వచ్ఛందమైన; స్వతంత్రమైన; ముక్తి పొందిన.
**मोचना** - स०क्रि० వదులుట; విడుదల చేయుట; పడవేయుట; ప్రవహింప జేయుట.
**मोची** - पुं० చెప్పులు కుట్టు జాతీయుడు, చర్మకారుడు.
**मोटा**-वि०లావైన; స్థూలమైన; అహంకారము గల; వికృతాకారముగల.
**मोड** - पुं० మలుపు ( దారి ) వంపు.
**मोडना** - स०क्रि० త్రిప్పుట; త్రిప్పివేయుట, మరల్చుట.
**मोताद** - स्त्री० మోతాదు; మాత్ర.
**मोती** - पुं० ముత్యము.
**मोथा** - पुं० తుంగగడ్డి.
**मोद** - पुं० ఆనందము; హర్షము; సుగంధము.
**मोदक** - पुं० లడ్డు.
**मोम** - पुं० మైనము.
**मोमबत्ती** - स्त्री० మైనపు వత్తి.
**मोर** - पुं० నెమలి.
**मोरचा** - पुं० తుప్పు; కోట రక్షణ నిమిత్తము నలు వైపుల త్రవ్వబడు కందకము; ఆక్రమణ; దాడి.
**मोरचा लेना** - मु० యుద్ధము చేయుట.
**मोरनी** - स्त्री० ఆడనెమలి.
**मोरपंख** - पुं० నెమలి పింఛము.
**मोरी** - स्त्री० पनाली ; మురికి కాలవ.
**मोल** - पुं० दाम ; ధర; వెల.
**मोलतोल करना** - स०क्रि० బేరమాడు.
**मोहलत** - स्त्री० వ్యవధి; గడువు; తీరిక;

సమయము.

**मोहसिन** - वि० ఉపకారము చేయు.

**मौखिक**-वि० నోటికి సంబంధించిన; నోటి మాటగా చెప్పిన.

**मौज** - स्त्री० తంగము; అల; ఉత్సాహము.

**मौजूद** - वि० హాజరుగానున్న; ప్రస్తుతము; తయారుగా.

**मौलाना** - पुं० అరబీ, ఫారసీ భాషలలో మహా విద్వాంశుడు.

**मौलिक** - वि० మూలమునకు సంబంధించిన, అసలైన.

**मौसम ; मौसिम** - पुं० ఋతువు; సరైన సమయము.

**मौसिमी** - वि० ఋతు సంబంధమైన.

**मौसा** - पुं० తల్లి సోదరి భర్త.

**मौसी** - स्त्री० తల్లి సోదరి.

**मौसेरा** - वि० తల్లి సోదరికి సంబంధించిన.

**म्यान** - पुं० కత్తి; ఖడ్గపు ఒర.

## य

**यंत्रणा** - स्त्री० యాతన; పీడనము.

**यकबारगी ; एकबारगी** - वि० दे० यकायक.

**यत्रतत्र** - क्रि०वि० అక్కడక్కడ; ఇటూ అటూ.

**यदाकदा** - अव्य कभी कभी ; అప్పుడప్పుడూ.

**यदा** - अव्य० ఎప్పుడైతే; ఎక్కడైతే.

**यदि** - अव्य० अगर ; అయినచో.

**यद्यपि** - अव्य अगरचे ; అయినప్పటికి.

**यम** - पुं० యమధర్మరాజు; నిగ్రహము; రెండు సంఖ్య.

**यमज ; यमल**-पुं० కవలపిల్లలజోడు; అశ్వినీ కుమారులు

**यवनिका** - स्त्री० రంగశాల తెర.

**यहाँ** - क्रि०वि० ఇక్కడ.

**यही** - अव्य० ఇదే; ఇతనే.

**यहूदी** - पुं० పాలస్తీనా దేశవాసి.

**या** - अव्य० లేక.

**यातायात**-पुं० आना-जाना ; రాకపోకలు.

**यान** - पुं० వాహనము; బండి.

**यानी ; याने** - अव्य० अर्थात; అంటే; అనగా.

**यामिनी** - स्त्री० రాత్రి.

**युग** - पुं० జంట; యుగము; జోడు.

**युगल** - पुं० జంట; యుగ్మము.

**युवा**-वि० యువావస్థలోనున్న; యువకుడు.

**यूँ** - पुं० यौ ; ఈ విధముగా; ఇట్లు.

**यों** - अव्य० ఈ విధముగా; ఇలా.

**योजना** - स्त्री० కూడిక; కలయిక; పథకము; స్కీము.

**यौवन** - पुं० जवानी ; యవ్వనము.

## र

**रंक** - वि॰ పేద; లోభి; సోమరి.

**रंग** - पुं॰ రంగు; వర్ణము; వన్నె; ప్రభావము; సాంగత్యము; శోభ.

**रंग ढंग** - पुं॰ నడత; వాలకము.

**रंगबिरंगा** - वि॰ పలు రంగులు గల; చిత్ర విచిత్రమైన.

**रंगरली** - स्त्री॰ ఆమోద ప్రమోదము; భోగ విలాసము.

**रंगीन** - वि॰ రంగుగల; విలాస ప్రియుడు; ఇంపైన.

**रंगीला** - वि॰ రసికుడు; ప్రేమికుడు.

**रंडापा** - पुं॰ వైధవ్యము.

**रंडी** - पुं॰ వేశ్య; కులట.

**रंध्र** - पुं॰ రంధ్రము; బెజ్జము.

**रंभाना** - अ॰क्रि॰ ఆవు అరచుట.

**रक्षाबंधन** - पुं॰ శ్రావణ పూర్ణిమకు వచ్చు రక్షా బంధన పండుగ.

**रखना** - स॰क्रि॰ ఉంచుట; రక్షించుట.

**रखवाली** - स्त्री॰ రక్షణ; కాపలా.

**रगडना** - अ॰क्रि॰ రుద్దుట, ఒరిపిడి పట్టుట; కష్టపెట్టుట.

**रचयिता** - पुं॰ రచించువాడు; గ్రంథకర్త.

**रचयित्री** - स्त्री॰ రచించు స్త్రీ; లేఖిక.

**रचित** - वि॰ రచించబడిన.

**रटना** - स॰क्रि॰ వల్లించుట; కంఠస్తము చేయుట.

**रण** - पुं॰ పోరాటము; యుద్ధము.

**रत्तीभर** - मु॰ जरासा ; బహుకొద్దిగా.

**रथ्या** - पुं॰ మార్గము; మురికికాలవ.

**रद्द** - वि॰ కొట్టివేయబడిన; రద్దుచేయబడిన.

**रपटना** - अ॰क्रि॰ జారుట; ఏదేని పని త్వరత్వరగా పూర్తిచేయుట.

**रबड** - पुं॰ రబ్బరు.

**रमता** - वि॰ ఒకచోట ఉండక ఎల్లప్పుడు తిరుగు వాడు.

**रमाना** - स॰क्रि॰ మోహపరచుట.

**रवा** - पुं॰ రవ్వ (గోధుమ వగైరా)

**रवाना**-वि॰ రవాణా చేయబడిన; పంపబడిన

**रवाना होना** - अ॰क्रि॰ బయలుదేరుట.

**रवैया** - पुं॰ నడవడి; పద్ధతి; నడక.

**रशीद** - वि॰ సభ్యతగల; సంస్కారముగల; ఉపదేశము ద్వారా ఋజు మార్గమునకు తీసుకు రాబడిన.

**रसाल** - पुं॰ మామిడి; చెఱకు; పనస గోధుమ; మధురమైన; మనోహరమైన.

**रसिक** - पुं॰ రసజ్ఞుడు; కావ్యమర్మజ్ఞుడు.

**रसीद** - स्त्री॰ రసీదు.

**रसोइया** - पुं॰ వంటవాడు; వంటచేయు వాడు.

**रसोई** - स्त्री॰ भोजन ; వంట.

**रसोईघर** - पुं॰ వంటిల్లు.

**रस्म** - स्त्री॰ రివాజు; పరిపాటి.

**रस्सी** - स्त्री॰ సన్ననిత్రాడు; దారము.

**रहँट** - पुं॰ నూతిగిలక.

**रहन-सहन** - स्त्री॰ तौर तरीका ; నడవడి.

**रहना** - अ॰क्रि॰ ఉండుట; నివసించుట; జీవించి యుండుట.

**रहा सहा** - यौ॰ అవశిష్టము; మిగిలి ఉన్న.

**राँड** - स्त्री॰ విధవ; వైధవ్యము పొందిన స్త్రీ; వేశ్య.

**राई** - स्त्री॰ సన్నావాలు.

**राख** - स्त्री॰ బూడిద; భస్మము.

**राखी** - स्त्री॰ రక్షాబంధన ద్వారము లేక తోరము; రక్ష

**राज** - पुं॰ రహస్యము.

**राज** - पुं॰ రాజ్యము; శాసనము; రాజు; తాపీ పనివాడు.

**राजकर** - पुं॰ ప్రభుత్వపు పన్ను.

**राजगीर** - पुं॰ తాపీపనివాడు.

**राजी** - वि॰ అంగీకరించిన; స్వస్థతగల; సంతోషముగల.

**राजीनामा** - पुं॰ సంధిపత్రము.

**राठ** - पुं॰ రాజ్యము.

**रात** - स्त्री॰ रजनी ; రాత్రి.

**राबिता** - पुं॰ కలుపుగోరుతనము; సంబంధము; బాంధవ్యము.

**राय**-स्त्री॰ అభిప్రాయము; సలహా; पुं॰రాజు; సమంతుడు; భట్రాజు ; वि॰శ్రేష్ఠమైన.

**राशि** - स्त्री॰ కుప్ప; పోగు; జ్యోతిష్యములోని రాశి.

**रास्ता** - वि॰ మార్గము; దారి; ఉపాయము.

**राह** - स्त्री॰ త్రోవ; దారి; ఆచారము.

**राहखर्च** - पुं॰ దారిభత్యము.

**राही** - पुं॰ యాత్రికుడు; బాటసారి.

**रिक्त** - वि॰ ఖాళీగానున్న; పేద.

**रिझाना**-सी॰क्रि॰ మోహించుట; తనమీద ప్రేమ జనింపజేయుట.

**रिश्तेदार** - पुं॰ नातेदार ; సంబంధీకుడు; చుట్టము; బంధువు.

**रिश्वत** - स्त्री॰ घूस ; లంచము.

**रिश्वतखोरी** - स्त्री॰ లంచగొండితనము.

**रिसना** - अ॰क्रि॰ కారుట; బొట్లుబొట్లుగా కారుట.

**रीझना** - अ॰क्रि॰ ముగ్ధమగుట; మోహింపబడుట.

**रीठा** - पुं॰ కుంకుడు చెట్టు లేక కాయ.

**रीढ** - स्त्री॰ వెన్నెముక; మేరుదండము.

**रीता** - वि॰ రిక్తమైన; ఖాళీగానున్న.

**रीति** - स्त्री॰ మాదిరి; పద్ధతి; రివాజు.

**रुंड** - पुं० శిరస్సు లేని మొండెము.
**रुई** - स्त्री० దూది.
**रुकना** - अ०क्रि० ఆగుట.
**रुकावट** - स्त्री० ఆగుదల; ఆటంకము; విఘ్నము.
**रुकसताना** - पुं० వీడ్కోలు సమయమున ఇచ్చు ధనము లేక కానుక.
**रुचिर** - वि० సుందరమైన; మధురమైన.
**रुझना** - अ०क्रि० చిక్కుకొనుట.
**रुझाना** - पुं० ప్రవృత్తి; వంపు; రుచి.
**रुत** - स्त्री० ఋతువు; ధ్వని; కలవరము.
**रुलाई** - स्त्री० ఏడుపు; రోదనము.
**रुलाना** - स०क्रि० ఏడిపించుట.
**रूई** - स्त्री० పత్తి; దూది.
**रूठना** - अ०क्रि० అలుగుట.
**रूपरेखा** - स्त्री० ఆకారప్రకారము.
**रूपसी** - स्त्री० సుందరమైన స్త్రీ సుందరి.
**रूपा** - पुं० వెండి.
**रूमाल**-पुं० చేతిరుమాలు; జేబురుమాలు.
**रेखा** - स्त्री० గీత; రేఖ.
**मेगमाल** - पुं० మెరుగు కాగితము.
**रेगिस्तान** - पुं० ఎడారి; ఇసుకమైదానము.
**रेतीला**-वि० ఇసుకగల; ఇసుక సంబంధమైన.
**रेलपेल** - स्त्री० పెద్దగుంపు; జనసమ్మర్దము; ఆధిక్యము.
**रेला** - पुं० ప్రవాహము; ప్రవాహపు త్రోపు; త్రోపిడి; త్రోపులాట.
**रेशम** - पुं० పట్టు వస్త్రము; కౌశేయము.
**रेहन** - पुं० गिरवी ; తాకట్టు.
**रैयत** - स्त्री० जनता ; ప్రజ.
**रैल** - स्त्री० दे० रेला.
**रोक** - स्त्री० ఆటంకము; విఘ్నము; నిషేధము.
**रोकड** - स्त्री० నగదు; రొక్కము; మూల ధనము.
**रोकना** -स्त्री० ఆపుట; అడ్డగించుట.
**रोज** - पुं० రోదనము; రుదనము.
**रोज** - पुं० దినము; దివసము; నిత్యవ ప్రతిదినము; సంవత్సరీకము.
**रोजगार** - पुं० వృత్తి; వ్యాపారము.
**रोटी** - स्त्री० రొట్టె; భోజనము; వంట
**रोदन** - पुं० రోదనము; క్రందనము; ఏ
**रोना** - अ०क्रि० ఏడ్చుట.
**रोपना** - स०क्रि० నాటుక; మొలకనా విత్తనము నాటుట.
**रोम** - पुं० శరీరము మీది వెంట్రుకలు; ఒ దేశపు రాజధాని నగరము.
**रोली** - स्त्री० కుంకమ.
**रोशन**-वि० ప్రకాశముగల; ప్రకాశమాన్వై ప్రసిద్ధమైన.

**रोशनाई** - स्त्री० సిరా.

**रोशनी** -स्त्री० ప్రకాశము;వెల్తురు; దీపకాంతి; జ్ఞానప్రకాశము.

**रौदना** - स०क्रि० కాలరాచుట; కాళ్ళతో మర్దించుట లేక త్రొక్కుట.

**रौनक**-स्त्री०రూపము; దీప్తి; శోన; ప్రఫుల్లత.

## ल

**लंका** - स्त्री० లంకాద్వీపము.

**लंगडा** - वि० కుంటివాడు. ఒకవిధమగు శ్రేష్ఠమైన మామిడి.

**लंगडाना** - अ०क्रि कुంటుట; కుంటుచూ నడచుట.

**लंगर** - पुं० లంగరు; గుదిబండలేని కొయ్య; అన్నదాన సత్రము.

**लंगर करना** - पुं० కొంటెతనము చేయుట; ఆకతాయి పని చేయుట.

**लंगूल** - पुं० తోక.

**लंगोटिया यार** - पुं० చిన్ననాటి స్నేహితుడు; బాల్య సఖుడు.

**लंघन** - पुं० లంఖణము; పస్తు; దుముకు; ఉల్లంఘనము.

**लंबाई ; लंबान** - स्त्री० పొడవు.

**लकडहारा** - पुं० కట్టెలు కొట్టువాడు.

**लकडी** - स्त्री० కర్ర; కొయ్య.

**लकीर** - स्त्री० గీత; రేఖ; పంక్తి; వరుస.

**लखना** - स०क्रि० చూచుట; కాన్పించిన లక్షణములా ధారముగా గ్రహించుట; ఊహించి గ్రహించుట.

**लगन**-स्त्री० ప్రేమ; ధ్యానము; సంబంధము; पुं० శుభముహూర్తము.

**लगना** - अ०क्रि० అనుకొనుట; తాకుట; అనిపించుట; ఆరంభమగుట.

**लगभग** - क्रि०वि० ప్రాయః; దాదాపు.

**लगातार** - क्रि०वि० ఎడతెరిపి లేకుండా; నిరంతరముగా.

**लगान** - पुं० సుంకము; శిస్తు.

**लगाम** - स्त्री० కళ్ళెము.

**लगाव** - पुं० సంబంధము.

**लघु** - वि० చిన్న; కొద్ది; తక్కువ; త్వరగా.

**लजाना** - अ०क्रि० సిగ్గుపడుట.

**लजालू; लजारू** - पुं० అత్తిపత్తిమొక్క.

**लजीला** - वि० లజ్జగల; సిగ్గుపడు.

**लटकना** - अ०क्रि० సందిగ్ధములో ఊగిసలాడుట; ఒయ్యారము పోవుట; వ్రేలాడుట.

**लट्ठ** - पुं० పెద్ద బాణాకర్ర.

**लट्ठमार** - वि० దెబ్బలాట ఆడువాడు; కటుభాషి.

**लडकपन** - पुं० బాల్యము; బాల్యావస్థ.

**लडका** - पुं० బాలుడు.

**लडकी** - स्त्री० బాలిక.

**लडखडाना** - अ॰क्रि॰ నిలువలేక తొట్రుపాటు పడుట.

**लडना** - अ॰क्रि॰ చెడు అలవాటు; దుర్వ్యసనము.

**लतीफ** - वि॰ రుచిగల; కోమలమైన; శ్రేష్ఠత.

**लदना**-अ॰क्रि॰ భారయుక్తమగుట; బరువు వేయ బడుట; కప్పబడుట; గడచుట; గతించుట.

**लपकना** - अ॰क्रि॰ కలియబడుట; తటాలున పట్టుకొనుట; పైకురుకుట.

**लपट** - स्त्री॰ జ్వాల; మంట; గమకము; సుగంధము.

**लपेटना**-स॰क्रि॰మెలిత్రిప్పుట; చిక్కుపడ వేయుట; జంజాటములో ఇరికించుట; చుట్టుట; సర్దుట; ద్రవపదార్థము పూయుట.

**लफंगा**-वि॰ దురాచారి; రౌడి; తిరుగుబోతు.

**लफ्ज** - पुं॰ శబ్దము; మాట.

**लबडना** - अ॰क्रि॰ అబద్ధమాడుట; గప్పాలుకొట్టుట.

**लबालब** - वि॰ అంచులవరకు నిండిన.

**ललकार** - स्त्री॰ సవాలు; కయ్యమునకు పిలుపు.

**ललकारना** - स॰क्रि॰ సవాలు చేయుట; కయ్యమునకు పిలుచుట.

**ललचना** - अ॰क्रि॰ పేరాశపడుట; మోహితుడగుట; కోరిక వలన కలత జెందుట.

**ललचाना** - स॰क्रि॰ ఊరించుట; మోహింపజేయుట; పేరాశ జనింపజేయుట.

**ललना** - स्त्री॰ స్త్రీ; కామిని.

**ललित** - वि॰ కోమలమైన; ఇష్టమైన; మనోహరమైన; చంచలమైన.

**लल्लो चप्पो**-स्त्री॰ ముఖస్తుతి; చాటుకారిత; మనస్సునకు నచ్చు తియ్యని మాటలు.

**लवंग** - पुं॰ लौंग ; లవంగము.

**लवंगी** - स्त्री॰ కోమలి; वि॰ నాజూకైన.

**लवण** - पुं॰ ఉప్పు.

**लस्सी**-स्त्री॰ పెరుగు చిలికిన మజ్జిగ; పంచదార కలిపిన ఒకవిధమగు పానీయము.

**लहँगा** - पुं॰ ఉచ్చారణ స్వరము; లయ.

**लहरा** - पुं॰ పెద్ద తరంగము; ఆనందము; ఉత్సాహము.

**लहचुन** - पुं॰ వెల్లుల్లిపాయ.

**लाँक** - स्त्री॰ నడుము.

**लाँग** - स्त्री॰ గోచి (ధోతి యొక్క)

**लांगूल** - पुं॰ తోక.

**लागू करना** - स॰क्रि॰ జారీచేయుట.

**लागू होना** - अ॰क्रि॰ జారీయగుట.

**लाचारी** - स्त्री॰ వివశత్వము; నిస్సహాయత.

**लाज** - स्त्री॰ शर्म ; సిగ్గు.

**लाट** - स्त्री॰ స్తూపము; पुं॰ గవర్నరు.

**लाड** - पुं॰ ఆప్యాయత; గారాబము.

**लात** - स्त्री॰ పాదప్రహారము; తన్ను.

**लाद** - स्त्री॰ బరువు; భారము; బరువు వేయుట; పొట్ట; ప్రేగు.

**लादना** - स॰क्रि॰ బరువు వేయుట; మోయుటకు భారమైన వస్తువులు వేయుట; బరువు ఉంచుట.

**लाना** - अ॰क्रि॰ తెచ్చుట; स॰क्रि॰ నిప్పు పెట్టుట; తగలపెట్టుట.

**लापरवाही**-स्त्री॰ నిర్లక్ష్యము; తృణీకారము.

**लायक** - वि॰ తగిన; యోగ్యమైన; ఉపయుక్తమైన.

**लार रपकना** - मु॰ నోరూరుట.

**लालच** - पुं॰ లోభము; పేరాశ.

**लालमिर्च** - स्त्री॰ ఎండు మిరపకాయ.

**लाली** - स्त्री॰ ఎరుపు; గౌరవము; ప్రతిష్ఠ.

**लावारिस** - वि॰ వారసులు లేని; ఉత్తరాధికారులు లేని.

**लाश** - स्त्री॰ శవము.

**लखिावट** - स्त्री॰ వ్రాత; దస్తూరి.

**लखित** - वि॰ వ్రాయబడిన; स्त्री॰ దస్తావేజు వ్రాత.

**लिपटना** - अ॰क्रि॰ అంటుకొనుట; కౌగిలించుట; మన్నుగుట.

**लिपि** - स्त्री॰ అక్షరములు వ్రాయు పద్ధతి.

**लियाकत** - स्त्री॰ యోగ్యత; అర్హత.

**लीक** - स्त्री॰ గీత; చార; ఆనవాయితి; ఆచారము.

**लीलना** - स॰क्रि॰ మ్రింగుట.

**लुंगी** - स्त्री॰ లుంగీ.

**लुंठित** - वि॰ దొర్లిన.

**लुकना** - अ॰क्रि॰ దాగుకొనుట; చాటున ఉండుట.

**लुगाई** - स्त्री॰ స్త్రీ; ఆడది.

**लुच्चा** - वि॰ దుష్టుడు; దురాచారి; చెడునడతగల; అబద్ధాలకోరు.

**लुटना** - अ॰क्रि॰ దోపిడీ చేయబడుట; నాశమగుట.

**लुटेरा** - पुं॰ దోపిడీ దొంగ.

**लुढकना** - अ॰क्रि॰ దొర్లుట.

**लुढकाना** - स॰कि॰ దొర్లించుట; పారబోయుట.

**लुत्फ** - पुं॰ ఆనందము; రుచి; స్వాదము; దయ; శ్రేష్ఠత.

**लुप्त** - वि॰ దాగిన; అదృశ్యమైన.

**लुहार** - पुं॰ लोहार ; కమ్మరివాడు.

**लुहारी** - स्त्री॰ కమ్మరిపని; కమ్మరి జాతి స్త్రీ.

**लू** - स्त्री॰ लुआर ; వడగాలి ; लूमारना

या लगना - मु० వడగాలి తగులుట; వడగాలుపు తగిలి జ్వరము వచ్చుట.

**लूट** - स्त्री० దోపిడీ; లూటీ.

**लूटना** -स०क्रि० దోచుట; దోపిడీచేయుట; మోసగించుట; మైమరచుట.

**लेकिन** - अव्य० కాని.

**लेख** - पुं० వ్రాత; వ్యాసము.

**लेखन** - पुं० వ్రాత; లెక్కచూచుట.

**लेखनी** - स्त्री० కలము.

**लेखिका** - स्त्री० వ్రాయుస్త్రీ; రచయిత్రి.

**लेटना** - अ०क्रि० పడుకొనుట; పవ్వళించుట.

**लेनदेन** - पुं० లావాదేవీలు ; लेनदेन - मु० సంబంధము.

**लेनहार** - वि० పుచ్చుకొనువాడు.

**लेना** - स०कि० తీసికొనుట; స్వీకరించుట.

**लेपना** - स०क्रि० ఏదేని లేపము పూయుట.

**लोंदा** - पुं० ముద్ద; పిండము.

**लोकलीक** - स्त्री० లోకమర్యాద.

**लोकापवाद** - पुं० లోకనింద.

**लोकोक्ति** - स्त्री० లోకోక్తి; సామెత.

**लोग** - पुं० జనము; ప్రజ.

**लोटना** - अ०कि० దొర్లుట; పొర్లుట; విశ్రమించుట; लोट जाना - मु० అపస్మారములోనుండుట; చనిపోవుట.

**लोटा** - पुं० చెంబు; చిన్న పాత్ర.

**लोटिया** - स्त्री० చిన్న చెంబు; लोटिया डूबना - मु० అసఫలమగుట; అప్రతిష్ఠపాలగుట; నష్టపోవుట.

**लोन** - पुं० లవణము; ఉప్పు.

**लोना**-वि० नमकीन ; ఉప్పని; సుందరమైన.

**लोप** - पुं० లోపము; నాశము; క్షయము.

**लोभ** - पुं० లోభము.

**लोमडी** - स्त्री० గుంటనక్క.

**लोरी** - स्त्री० జోలపాట.

**लोलक** - पुं० లోలాకు; లోలకి.

**लोहा** - पुं० ఇనుము; అస్త్రము.

**लोहार** - पुं० लुहार ; కమ్మరి.

**लोहारी** - स्त्री० लुहारी ; కమ్మరిపని.

**लोहू** - पुं० दे० लहू.

**लौंग** - पुं० లవంగము; లవంగ ఆకారములో నున్న ముక్కుపుడక.

**लौंडा** - पुं० छोकरा ; పిల్లవాడు; పిల్లకాయ; పోరిగాడు.

**लौंडी** - स्त्री० छोकरी ; పోరి; దాసి.

**लौकी** - स्त्री० ఆనపకాయ; సొరకాయ.

**लौटना** - अ०क्रि० తిరిగివచ్చుట; వెనకకు తిరుగుట.

**लौटाना** - स०क्रि० తారుమారు చేయుట; తిరిగి ఇచ్చుట; మార్చుట.

# व

**वंग** - पुं० బెంగాలు ప్రదేశము; తగరము; తగర భస్మము.

**वंचित** - वि० మోసగింపబడిన; వేరుపరచ బడిన; రహితమైన.

**वंदन** - पुं० వందనము; ప్రణామము.

**वंदना** - स्त्री० స్తుతి; ప్రణామము; నమస్కారము.

**वंदनीय** - वि० ఆదరించదగిన; వందన యోగ్యమైన.

**वंध्या** - स्त्री० గొడ్రాలు; సంతానములేని స్త్రీ.

**वंश** - पुं० కులము; వంశము; వెదురు.

**वंशी** - स्त्री० మురళి; పిల్లనగ్రోవి; अव्य० మరియు; पुं० వాయువు.

**वक्त** - पुं० సమయము; కాలము; అదను; తీరిక.

**वक्र** - वि० వంకరగల; వక్రమైన.

**वगैरह** - अव्य० ఇత్యాది; మొదలైనది.

**वचन** - पुं० మాట; శబ్దము; కథనము; వచనము (ఏకవచనము, బహువచనము).

**वजन** - पुं० భారము; బరువు; తూకము; గౌరవము.

**वजह** - स्त्री० కారణము; హేతువు.

**वतन** - पुं० జన్మభూమి.

**वत्स** - पुं० దూడ; బిడ్డ.

**वदंती** - स्त्री० పుకారు; కథనము; మాట.

**वदन** - पुं० ముఖము; వదనము; కథనము.

**वध** - पुं० వధ; హత్య.

**वधक** - पुं० హంతకుడు; ఘాతకుడు.

**वधू ; वधूटी** - स्त्री० వధువు; కొత్తగా పెళ్ళి అయిన యువతి; కోడలు.

**वन्य** - वि० వన సంబంధమైన.

**वपन** - वि० విత్తునాటుట; క్షౌరము.

**वमन** - पुं० కక్కు; వమనము; వాంతి.

**वय** - स्त्री० వయస్సు; ఈడు.

**वरदी** - स्त्री० ఒకే రకపు డ్రెస్సు.

**वरना** - क्रि०वि० లేనిచో; అన్యధా पुं० ఒంటె.

**वरेण्य** - वि० శ్రేష్ఠమైన; పూజ్యమైన; ప్రధానమైన.

**वर्ग** - पुं० శ్రేణి; వర్గము; చదరము.

**वर्गफल** - पुं० చదరపు కొలత; వైశాల్యము.

**वर्जना** - स०क्रि० అభ్యంతర పెట్టుట; నిషేధించుట; త్యజించుట.

**वर्जित** - वि० త్యజింపబడిన; నిషేధించుట.

**वर्दी** - स्त्री० दे० वरदी.

**वर्ष** - पुं० సంవత్సరము.

**वर्ष गाँठ** - स्त्री० జన్మదిన పండుగ.

**वल्ली** - स्त्री० లత.

**वश्य** - वि० వశ్యమైన; వశములోనున్న.

**वसूल** - वि० ప్రాప్తించిన; లభించిన; తీర్చబడిన.

**वसूली** - स्त्री० ప్రాప్తి; ఇతరులనుంచి వసూలు చేయుట; వసూలు కావలసిన సొమ్ము; వసూలి.

**वहाँ** - अव्य० అక్కడ.

**वह्नि** - स्त्री० అగ్ని; నిప్పు.

**वहीं** - अव्य० అక్కడే; అచ్చటనే.

**वही** - सर्व० పూర్వోక్త వ్యక్తి లేక విషయము లేక వస్తువు; నిర్దిష్టమైన వ్యక్తి; విషయము; వస్తువు మాత్రమే.

**वांछनीय** - वि० కోరదగిన.

**वांछित** - वि० కోరబడిన; కోరిన.

**वा** - अव्य० अथवा ; या ; లేక.

**वाकई** - वि० నిజమైన; యధార్థమైన ; अव्य० నిజానికి; వాస్తముగ.

**वाक्पटु** - वि० మాటకారి; చతురుడు.

**वाचन** - पुं० పఠనము; చదువుట.

**वाचनालय** - पुं० పఠనాలయము.

**वाचा** - स्त्री० వాణి; వాక్యము; శబ్దము;

**वाजिबी** - वि० ఉచితమైన; సరియైన; पुं० ప్రతిమాసము లభించు వేతనము లేక బత్తెము.

**वाटिका** - स्त्री० తోట; వాటిక.

**वादा** - पुं० వాగ్దానము; ప్రతిజ్ఞ.

**वापस** - वि० తిరగివచ్చిన.

**वापस आना** - अ०क्रि० తిరిగి వచ్చుట.

**वापसी** - वि० తిరిగివచ్చియున్న; త్రిప్పి వేసియున్న. स्त्री० ప్రత్యావర్తనము; తిరిగిరాక.

**वारा** - पुं० किफायत ; పొదుపు.

**वाला** - प्रत्य० ఒకసంబంధసూచక శబ్దము; ఉదా: गाडीवाला ; मकानवाला वि० శ్రేష్ఠమైన; మహోన్నమైన.

**वासंतिक**-पुं० విదూషకుడు; నృత్యకారుడు.

**वास** - पुं० వాసము; నివాసము; ఇల్లు; గంధము; సుగంధము.

**वास्ता** - पुं० సంబంధము; స్నేహము.

**वास्ते** - अव्य० నిమిత్తము; కొరకు.

**वाहवाही** - स्त्री० జనామోదము; ప్రశంస్తుతి.

**विकसना** - अ०कि० వికసించుట.

**विकसित** - वि० ప్రస్ఫుటితమైన; వికసిం; ప్రఫుల్లమైన.

**विक्षिप्तता** - स्त्री० పిచ్చి.

**विगत** - वि० గడచిపోయిన; గతించిన.

**विचरना** - अ०क्रि० తిరుగుట.

**विचलित** - वि० అస్థిరమైన; ప్రతిజ్ఞ లేక సంకల్పమునకు భిన్నముగానున్న.

**विचार** - पुं० అభిప్రాయము; భావము;

వ్యాజ్యము తీర్పు.
**विचारना** - अ०क्रि० ఆలోచించుట; జాడ తీయ ప్రయత్నించుట.
**वित्त** - पुं० ధనము; సంపత్తి.
**विदित** - वि० తెలిసిన; ఎరిగిన; వ్యక్తమైన.
**विदीर्ण** - वि० చీల్చబడిన; చంపబడిన.
**विदुषी** - स्त्री० పండితురాలు.
**विधान** - पुं० ప్రబంధము; ఏర్పాటు; పద్ధతి; నిర్మాణము.
**विधि** - स्त्री० వ్యవస్థ; కార్యపద్ధతి; ప్రణాళి; బ్రహ్మ.
**विधिवत्** - क्रि०वि० విధిననుసరించి; చట్ట ప్రకారము.
**विनति ; विनती** - स्त्री० నమ్రత; ప్రార్థన.
**विनय** - स्त्री० వినమ్రత; ప్రార్థన.
**विनयी** - वि० వినమ్రమైన.
**विनीत** - वि० వినయ యుక్తమైన; నమ్రతగల.
**विनोद** - पुं० కుతూహలము; వినోదము; తమాషా.
**विप्लव** - पुं० ఉపద్రవము; అశాంతి; గలభా; విప్లవము.
**विबुध** - पुं० పండితుడు; చంద్రుడు; దేవత.
**विभक्त** - वि० వేరుపరచబడిన; విభక్తమైన; విభజింపబడిన.
**विभव** - पुं० సంపత్తి; సంపద; ఐశ్వర్యము.
**विभा** - स्त्री० దీప్తి; కాంతి; ప్రకాశము.
**विभाकर** - पुं० సూర్యుడు; అగ్ని; రాజు.
**विभाग** - पुं० పంపిణి; విభాగము; వితరణము.
**विभाजक** - वि० విభజించు.
**विभाजित** - वि० విభక్తమైన.
**विभाज्य** - वि० విభజింపదగిన; విభజింప వలసిన.
**विभाति** - स्त्री० శోభ.
**विभावरी** - स्त्री० రాత్రి; నక్షత్రముల కాంతి గల రాత్రి ; దూతి.
**विभासना** - अ०क्रि० మెరయుట.
**विभिन्न** - वि० విశిష్టమైన; పలువిధములైన.
**विभीषिका** - स्त्री० భయోత్పాదకము; భయానక దృశ్యము.
**विभूति** - स्त्री० ఆధిక్యము; అతిశయత; ఐశ్వర్యము; విభవము.
**विभूषित** - वि० అలంకృతమైన; ఆభూషణములతో శోభాయమానమగు.
**विभोर** - वि० విహ్వాలమైన; మగ్నమైన; వికలమైన.
**विभ्रम** - पुं० భ్రమణము; భ్రాంతి; శోభ; సౌందర్యము.
**विमंडित** - वि० అలంకృతమైన.
**विमत**-पुं० విసమ్మతి; వ్యతిరేక అభిప్రాయము.

**विमनस्क** - वि० అన్యమనస్కమైన.
**विमर्श** - पुं० విమర్శ; సమీక్ష; పరామర్శ.
**विमर्ष** - पुं० విచారణ; ఆలోచన; వ్యాకులత; క్షోభ; ఉద్యోగము.
**विमल** - वि० స్వచ్ఛమైన; నిర్మలమైన; మనోహరమైన.
**विमला** - स्त्री० సరస్వతి.
**विमाता** - स्त्री० सौतेली माँ; సవతి తల్లి.
**विमार्ग** - वि० కుమార్గము; చెడుదారి.
**विमुक्त** - वि० స్వతంత్రమైన; స్వచ్ఛందమైన.
**विमुख** - वि० ముఖరహితమైన; ముఖము తిప్పిన; అననుకూలమైన.
**विमुग्ध** - वि० బహు ముగ్ధమైన; భ్రాంతమైన; మత్తెక్కిన.
**विमूढ** - वि० భ్రాంతమైన; విశేషముగా మోహింపబడిన; మూర్ఛజెందిన.
**विमोचन** - पुं० విముక్తి; విడుదల.
**विमोहक** - वि० మోహించువాడు; విముగ్ధునిగా చేయువాడు.
**विरचित** - वि० నిర్మితమైన; వ్రాయబడిన.
**विरत** - वि० విముఖమైన; విరక్తినొందిన; నివృత్తమైన; నిమగ్నమైన.
**विरोचन** - पुं० దీప్తి; ప్రకాశము; శోభ.
**विलंब** - पुं० ఆలస్యము.
**विलंबित** - वि० వ్రేలాడుచున్న; ఆలస్యమైన.
**विषम** - वि० असमान ; సమముగాలేని.
**विस्मृत** - वि० మరచిన; మరచిపోయిన.
**विस्मृति** - स्त्री० విస్మరణము; మరుపు.
**वेत्ता** - वि० తెలిసినవాడు; జ్ఞాత.
**वेला** - स्त्री० కాలము; సమయము; వేళ; సముద్రపు ఒడ్డు.
**वैकल्पिक** - वि० ఇష్టానుసారము ఎన్నుకొనదగిన.
**वैसा** - वि० ఆ మాదిరి.
**व्यथा** - स्त्री० క్లేశము; వేదన; దుఃఖము; బాధ.
**व्यथित** - वि० వేదన పొందుతున్న; బాధపడు.
**व्यवसाय** - पुं० జీవిక; వృత్తి; ఉద్యోగము.
**व्यस्त**-वि० పనిలో నిమగ్నమైన; కలతజెందిన వ్యాప్తమైన.
**व्याख्यान** - पुं० ఉపన్యాసము; వక్తృత.
**व्याघ्र** - पुं० పెద్దపులి; వ్యాఘ్రము.

## श

**शऊर** - स्त्री० పనిచేయు వడుపు; తరహా; తెలివి.
**शकरकंद** - पुं० చిలకడదుంప.
**शकल**-स्त्री० ఆకృతి; ఆకారము; రూపపటు; పద్ధతి.
**शक्की** - वि० అనుమానించు; సంశయించు.
**शख्स** - पुं० మానవ శరీరము; వ్యక్తి; మనిషి.

**शतरंज** - पुं० చదరంగము.

**शतरंजी** - स्त्री० చదరంగపు గళ్ళు గల చదరంగపు ఆట పట్టా.

**शतशः** - वि० వందలకొలది; వందరెట్లు.

**शनैः** - अव्य० धीरे ; మెల్లిగా.

**शम** - पुं० శాంతి; ఓర్పు.

**शमशेर** - स्त्री० ఖడ్గము; కత్తి.

**शमा** - स्त्री० మైనపు వత్తి.

**शमादान** - पुं० దీపపు శెమ్మె.

**शमित** - वि० శాంతించిన.

**शरम** - स्त्री० సిగ్గు; లజ్జ; ప్రతిష్ఠ; సంకోచము; గౌరవము.

**शरमाना** - अ०क्रि० సిగ్గుజెందుట; **स०क्रि०** సిగ్గుపడునట్లు చేయుట.

**शरमीला** - वि० సిగ్గుచెందు; సిగ్గుపడు; లజ్జ గల.

**शरमीला** - वि० త్వరగా సిగ్గుపడు.

**शराफत** - स्त्री० సౌజన్యము; సజ్జనత; మంచితనము.

**शराब** - स्त्री० మద్యము; సారాయి.

**शराबखाना** - पुं० పానశాల.

**शराबखोर** - पुं० शराबी ; అలవాటుగా మద్యము సేవించువాడు.

**शरारत** - स्त्री० కొంటెతనము; తుంటరితనము.

**शरीक** - वि० కలసిన; సమ్మిళితమైన; **पुं०** సహచరుడు; భాగస్తుడు.

**शरीफ** - वि० కులీనస్తుడు; సభ్య పురుషుడు; పెద్దమనిషి.

**शरीफा** - पुं० శీతాఫలము.

**शर्करा** - स्त्री० పంచదార; ఇసుకరేణు.

**शर्त** - स्त्री० నిబంధన; షరతు.

**शर्म** - स्त्री० दे० शरम.

**शर्वरी** - स्त्री० రాత్రి; సంధ్యాసమయము; స్త్రీ.

**शलाख** - स्त्री० दे० सलाख.

**शल्य** - पुं० ఎముక; బల్లెము; బాణము.

**शशशृंग** - पुं० కుందేటి కొమ్ము; ఏదేని అసంభవ కార్యము.

**शस्य** - पुं० పైరు; పంట; కొత్తగా మొలచిన గడ్డి; ధాన్యము.

**शहद** - पुं० తేనె ; మధువు.

**शहद लगाकर चाटना** - मु० పనికిమాలిన వస్తువులను భద్రముగా చూచుకొనుట.

**शहर** - पुं० పట్టణము; నగరము.

**शहीद** - पुं० ఏదేని సమిష్టి కార్యము కొరకు బలియైనవాడు.

**शाक** - पुं० వండని కూరకాయ లేక ఆకు కూర.

**शादी** - स्त्री० ఆనందము; ఆనందోత్సవము;

వివాహము.

**शाबाशी**-स्त्री० वाहवाही ; ప్రశంస; పొగడ్త.

**शाम** - स्त्री० साँझ ; సాయంత్రము.

**शामियाना** - पुं० ఒకవిధమైనగుడ్డ పందిరి; ఒకవిధమగు గుడారము.

**शामिल** - वि० కలసిన; కలసియున్న; సమ్మిళితమైన.

**शायद** - अव्य० బహుశా; ఒకవేళ.

**शायर** - पुं० ఉర్దూ, పారసీ భాషల్లో కవితలల్లు వ్యక్తి; కవి.

**शायरा** - स्त्री० కవయిత్రి; స్త్రీ కవి.

**शायरी** - स्त्री० కవిత్వము; కావ్యరచన.

**शालीन** - वि० వినమ్రమైన; లజ్జగల; సమానమైన; శిష్టాచారము గల; దక్షత గల.

**शावक** - पुं० బిడ్డ; పశు శావకము; పక్షి శావకము, కూన.

**शाहजादा** - पुं० మహారాజ కుమారుడు.

**शिकार** - पुं० వేట; మృగయ.

**शिकार खेलना** - मु० వేటాడుట.

**शिकारी** - वि० వేటాడువాడు; వేటగాడు.

**शिक्षा** - स्त्री० విద్య; చదువు.

**शिवाला** - पुं० శివాలయము.

**शीतला** - स्त्री० మసూచి రోగము; స్ఫోటకము.

**शीरीं** - वि० మధురమైన; ప్రియమైన.

**शीशा** - पुं० आइना ; అద్దము.

**शीशी** - स्त्री० సీసా.

**शुंडी** - पुं० ఏనుగు; మద్యము తయారు చేయువాడు.

**शुक** - पुं० చిలుక; శిరీష వృక్షము; శుక మహర్షి.

**शुक्रिया** - पुं० ధన్యవాదము; కృతజ్ఞత చెప్పుట.

**शुमार** - पुं० గణన; లెక్క లేక లెక్కించుట.

**शुरू** - पुं० ఆరంభము; ప్రారంభము.

**शुल्क** - पुं० సుంకము ; బాడుగ; కట్నము; అద్దె; పన్ను; వేతనము లేక ఫీజు.

**शुश्रूषा** - स्त्री० పరిచర్య.

**शेखचिल्ली** - पुं० ఆకాశరామన్న; గప్పాలు కొట్టువాడు वि० కొంటెవాడు; తుంటరి.

**शेखी** - स्त्री० గర్వము; అహంకారము; దర్పము; గీర.

**शेर** - पुं० వ్యాఘ్రము; ఉర్దూ కావ్య రచన రెండు పాదములు గల ఒక పద్యము; సాహసోపేతమైన వీరుడు.

**शेष** - पुं० మిగిలిన వస్తువు; శేషించిన వస్తువు తీసివేయగా మిగిలిన సంఖ్య; वि० మిగిలిన; చివరికి చేరిన; సమాప్తమైన.

**शैतान** - पुं० భూతము; ప్రేతము; దుష్టుడు.

**शैतानी** - स्त्री० తుంటరితనము; కొంటె

